పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి








































# పాకిస్తాన్ తంతు!

శ్రీ సరిపల్లి ద్వారకనాధ్

(తెరవెనుక లియాఖత్ అలీఖాన్)

"...కిస్థాన్ ప్రజల్లారా!
ముఖ్యంగా, ముస్లిమ్ యువకుల్లారా!
ఈవిషయం వినండి మీరంతా
కలిసి పనిచెయ్యాలిప్డు మనమంతా!
కాశ్మీర్ మన దేశపు టంతర్భాగ...
విడువం ఎన్నటికి మనమా భూభాగం!
మనమంతా పిడికిలి బిగించాలి!
కాశ్మీర్ కోసం మనసర్వం తెగించాలి!
మన పొరుగు దేశం, భారత దేశం
కాశ్మీర్ను వొదలాలని మన ఆదేశం!
ఘజ్నీ, గోరీల పరాక్రమమంతా
చవిచూపించాలి ఘాటుగ మీరంతా!
దురాక్రమణచేసి, భారత దేశం
పెనుగు లాడుతోంది కాశ్మీర్ కోసం!
కానిచో, తనసైనిక బలాన్నెందుకుని
భారత దేశం నడిపిస్తోంది ముందుకు?
కావున ముస్లిము సోదరులంతా
ఇప్పుడు చూపించాలి తమ బలమంతా!"

(తెరవెలుపల లియాఖత్)

"అయ్యా! పండిట్ నెహ్రూ గారూ!
తమరొకసారి ... రారూ?
శాంతి సంప్రదింపులకు సిద్ధంగఉన్నాం
ఈ విషయం మే మిదివరకే అన్నాం.
ఇండో-పాక్ ఒడంబడికల్ని మీరాజ్యం
పాలిస్తోందన్న విషయంపూర్తిగ పూజ్యం.
పాకిస్థాన్పై ఘోర యుద్ధ ప్రచారం
మీ దేశంలో సాగినందుకు విచారం!
మేమన వరతం కోరేది శాంతి
అది లేనివో లేదు మాకు విశ్రాంతి!
కాశ్మీర్ సమస్యని పరిష్కరించదు యుద్ధం,
యుద్ధం మా ఆశయాలకే పూర్తిగ విరుద్ధం!
ఈ విషయం తెలుసు ప్రపంచానికంతకూ!
అయితేనే చెప్పే దేమిటంటే యింతకూ,
మీరు కరాచీ ఒక్కసారి రావాలని
శాంతి యుతంగా యీసమస్య పూర్తవాలని!
ముందుగ మీసైన్యాల్ వెనక్కి తరలించి,
కాశ్మీర్ నుండి మీ దృష్టి మరలించి,
మా షరతుల నైదింటిని మన్నించి,
మిమ్మల్ని కరాచీ రమ్మని విన్నవించి
యున్నాంలోగడ; అందుచే యిప్పుడుమీరు
తప్పక రావాలి కరాచీ; ఇదిష్యూరు!

హక్కులకోరకు తాము పోరాడుతున్నట్లు ప్రకటించి, సమావేశాన్ని ప్రచార సాధనంగా వాడుకోవడానికి మాత్రమే రష్యా ప్రతినిధులు హాజరవుతూ ఉండవచ్చును.

జపాన్ యుద్ధంలో ప్రధానపాత్ర నిర్వహించినవి, జపాన్ దురాక్రమణవల్ల ఎక్కువగా నష్టపడినవి ఆసియా దేశాలు. ఈ దేశాలకు, ముఖ్యంగా కమ్యూనిస్టు చైనాకు అంగీకారయోగ్యం కాని సంధివలన శాంతి ఎన్నటికీ రక్షింపబడజాలదు. జపాను భౌగోళికంగాను, వ్యాపార సంబంధాలరీత్యానూ ఆసియా దేశాలన్నిటికీ సన్నిహితమైనది. అమెరికా ఆర్థికంగా ఎంత సహాయం చేసినా జపాన్ భావ్యభివృద్ధి చైనా, ఇండియా, బర్మాలవంటి దేశాలతో సంబంధాలపైననే ఆధారపడి ఉంటుంది. ముఖ్యంగా ప్రస్తుత జపాన్సంధి సాధించేది ఒక్కటే - అది చైనా, జపానుల శత్రుత్వాన్ని వృద్ధిచేయడం. ఇందువలన ఫ్రిస్కోలో జరగబోతున్న సంతకాలసమావేశాన్ని "ఫియాస్కో" అంటే ఆశ్చర్యపడ నవసరంలేదు. ★

# డైరీ

(3-వ పేజీ తరువాయి)

—సెప్టెంబరు నెలలో మద్రాసు రాష్ట్రానికి 30 వేల టన్నుల బియ్యం కేంద్రం నుండి వస్తాయి.

## గురువారం, ఆగస్టు 30:

—బొంబాయిరాష్ట్రంలో ఇరవై లక్షుల టన్నుల పెట్రోలు రిఫైనరీ నొకదాన్ని గాని, బొంబాయి, మద్రాసు రాష్ట్రాల్లో పదేసి లక్షుల టన్నుల రిఫైనరీలను రెంటిని గాని స్థాపించాలని భారత ప్రభు ం ఇండియాలోని మూడు నూనెకంపెనీలను కోరింది.

—శాన్ ఫ్రాన్సిస్కో ఒడంబడికపై పాకిస్తాన్ సంతకం చేయడానికి నిశ్చయించింది.

—కేసాంగ్ తటస్థప్రాంతంపై సమితి విమానాలు తిరిగి దాడులు చేసినట్లు కమ్యూనిస్టులారోపించారు.

—శాన్‌ఫ్రాన్సిస్కో ఒడంబడిక ముసాయిదాకు విరుద్ధంగా ఉండేమాదిరి ఒడంబడికను తాము జపాన్‌తో చేసుకో గోరడం లేదని భారతప్రభుత్వం అమెరికాకు తెలియపరిచింది.

—డా॥ రాజేంద్రప్రసాద్ గారికి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారు "డాక్టర్ ఆఫ్ లాస్" గౌరవ బిరుదం ఇచ్చారు.

—జమ్మూ కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్తుకు 'లే' నియోజకవర్గంనుండి లడక్ ప్రధానలామా పోటీలేకుండా ఎన్నుకోబడ్డాడు.

—సూయజ్ కాలువపై ఈజిప్ట్ దిగ్బంధమును నిరసిస్తున్న తీర్మానమును రష్యా వీటో చేయగలనని బెదిరించడంచేత భద్రతామండలి దాన్ని వాయిదా వేసింది.

—ఎ. కాశేశ్వరరావుగారి వరకట్నాల నిషేధం బిల్లును అసెంబ్లీలో ప్రవేశపెట్టడానికి అనుమతి ఇవ్వబడింది.

## శుక్రవారం, ఆగస్టు 31:

—ముద్రణాలయ (నేరప్రేరణ నిషేధ) చట్టమును హోంమంత్రి గోపాల చారి గారు పార్లమెంటు [illegible].

—కొరియా [illegible] గాన సమితి బలాలు నిర్విరామంగా విమానదాడులు, ఫిరంగిదాడులు జరుపుతున్నాయి. కేసాంగ్ ప్రాంతాన యుద్ధం తిరిగి ప్రారంభమైందని పెకింగ్ రేడియో ప్రకటించింది.

—ఆస్తి పన్నులను (వ్యవసాయభూములపై) విధించే ప్రతిపాదనను మద్రాసు ప్రభుత్వం ప్రస్తుతానికి విరమించింది.

ఇ [illegible]
ఎన్ను [illegible]

—ఆంధ్ర [illegible]
2 లోగా జరగాల [illegible]
ఉన్నవ లక్ష్మీనారా [illegible]
జరిగిన అఖిలపక్షమహా [illegible]

## శనివారం, సెప్టెంబరు

—పెట్రోలు తగాదాపై ప్రతిపాదన ఏమీ చే [illegible] ప్రధాని మొసాదిక్ ప్రకటిం [illegible]

—కేసాంగ్ తటస్థప్రాంతం [illegible] విమానాలు దాడిచేశాయన్న కమ [illegible] ఆరోపణను సమితి త్రోసివేసింది.

—సూయజ్ కాలువపై ఈజిప్టు దిగ్బంధమును నిరసిస్తూ అమెరికా, బ్రిటను, ఫ్రాన్సులు ప్రతిపాదించిన తీర్మానమును భద్రతామండలి ఆమోదించింది. దిగ్బంధము నెత్తివేయాలని తీర్మానం కోరింది. రష్యా, ఇండియా, చైనాలు ఓటు చేయలేదు.

—1951 సం॥ ప్రథమార్థంలో ఇండియాలోని 40 ప్రధాన పరిశ్రమల ఉత్పత్తి అధికమైనట్లు ప్రకటింపబడింది. ★

---

భార్య : "ఏమండీ, రాత్రి మరీ భయంకరగా గుర్రుపెట్టారు?"

భర్త : "నువ్వు నన్ను లేపి ఉండవలసింది."

భార్య : "ఎందుకూ ?"

భర్త : "గుర్రుపెడుతుంటే నాకు నిద్రపట్టదు."

*　*　*　*

ఒకడు : "నువ్వు ఊరికే అలా వాగకపోతే, మాట్లాడేముందు ఏం మాట్లాడబోతున్నావో కాస్త ఆలోచించుకోగూడదూ?"

రెండోవాడు : "అది అసంభవం. మాట్లాడిన తర్వాతగాని ఏం మాట్లాడానో నాకే తెలియందే, ఇంక ఆలోచించుకోవడ మెప్పుడు ?"




చీఫ్ ఏగ్జెక్యూటివ్ : జె. ఎమ్. శర్మ

సీడెడ్ అండ్ చిత్తూరు: మహాత్మా పిక్చర్సు - కర్నూలు. * ఆంధ్రా: గోకులకృష్ణ పిక్చర్సు - విజయవాడ.
మైసూరు: నారాయణన్ & కంపెనీ-మద్రాసు. * సిటీ: అవర్ ఇండియా ఫిలిమ్సు, 19-ఇ, ఏకాంబరేశ్వర అగ్రహారం, మద్రాసు.
ఇతర ప్రాంతాలకు:
ప్రకాష్ శంకర్ పిక్చర్సు, 8-ఏ, లక్షుణచెట్టియార్ వీధి, మద్రాసు-17.

# సముద్ర సందర్శనము

ముసురు కాస్త తెరపి ఇయ్యటం చూచుకొని, చిన్న భావమరది వెంకటేశాన్ని పోరి పోరి, బ్రహ్మప్రయత్నంమీద ఎలాగో చివరకు సముద్రసందర్శనానికి బయలుదేర తీయగలిగాడు గోవిందు. కాఫ్యాది ప్రాతః కాల ఆవశ్యకాలు తీర్చుకుని, ఎనిమిదిగంటలకల్లా భావమరదులిద్దరూ సైకిళ్లకి ముందు గొడుగులు తగిలించుకొని సముద్రాభిముఖంగా బయలుదేరారు. ఆ ఊరికి సముద్రం అయిదు మైళ్ల దూరంలో ఉంది. అక్కడక్కడ చిన్న చిన్న నీళ్ళపడియలతోనూ, బురదతోనూ చికాకుగా ఉన్న రోడ్డుమీద, ఈడ్చి ఈడ్చి కొడుతూన్న ఈదురుగాలిని చీల్చుకుంటూ అతి కష్టంమీద సైకిళ్లు ముందుకి సాగిపోతున్నవి.

ఆ ముసురులో, చలిలో, ఆ ఉదయం పూట సముద్రానికి బయలుదేరటం వెంకటేశానికి ససేమిరా ఇష్టంలేదు. ఎదురుగా వస్తూన్న జనం ఎందుకోసం నవ్వుతున్నా, తమను చూసే నవ్వుతున్నారని భావిస్తూ, అతడు భావగారివేపు కొరకొరలాడుతూ చూస్తున్నాడు. గోవిందుమాత్రం ఇకకొన్ని నిముషాల్లో తమ కన్నులముందు సాక్షాత్కరింపబోతున్న గంభీర సుందర సముద్రమూర్తిని లోలోపల భావించుకుంటూ పరవశుడై పోతున్నాడు.

**శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు**

గోవిందు కవి. పట్టభద్రసముద్రతో కాలేజీనుంచి అప్పుడే బయటకు వచ్చినవాడు. ఇంగ్లీషుభాషలో నావిక జీవితానికి సంబంధించిన సారస్వతం అతన్ని అమితంగా ఆకర్షించింది. కాలేజీలో చదువుకునే రోజుల్లో సముద్రాన్నిగూర్చి అతడు చిత్రచిత్రాల కలలు కనేవాడు. ఏ ఓడమీద అయినా తనకొక ఉద్యోగం లభించి, ఈ మానవజగత్తుకి దూరంగా జలదేవత చల్లని వడిలో, విశాలాకాశపు చాందినీ క్రింద తన భవిష్యత్ జీవితమంతా గడిపివేయగలిగితే ఎంతో బాగుండు ననుకునేవాడు. మొదటినుంచీ మానవ సంఘమంటే అతనికి తగని అవిశ్వాసం, అనాదర భావం ఉండేవి. తాను చదివిన పాశ్చాత్య సారస్వతంద్వారా మానవుణ్ణి స్వార్థపరుడుగానూ, సర్వవిధములైన దౌర్బల్యాలకీ స్థానంగానూ మాత్రమే అతను అర్థం చేసుకున్నాడు. పాశ్చాత్యదేశాలతో పోల్చిచూస్తే, భారతదేశం మరీ అనాగరకమైనదనీ, అందుచేత ఇక్కడి మానవసమాజం మరింత నికృష్టశ్రేణికి చెందిందనీ కూడా అతను విశ్వసించేవాడు.

సముద్రమంటే గోవిందు అంతగా ప్రాణాలు విడవటానికి మరొక కారణం కూడా లేకపోలేదు. అతని స్వగ్రామానికి ఎటు చూచినా నూరు మైళ్లలోపుగా సముద్రంలేదు. పెళ్లికి అత్తవారి ఊరికి తరలి వచ్చిన సందర్భంలోనే అతను మొట్టమొదటిసారిగా సముద్రాన్ని చూచాడు. అటుపిమ్మట ఎప్పుడు అత్తవారి ఊరు వచ్చినా, కనీసం ఒకసారిఅయినా సముద్రతీరానికి పోయిరావలసిందే! అయితే ఈసారి అతడు బ్రహ్మాండమైన ఒక ముసురునుకూడా వెంటపెట్టుకొని మరీ వచ్చాడు. అతను వచ్చి మూడు రోజులైనా ముసురు పూర్తిగా తెరపిఇచ్చే సూచనలు కనిపించలేదు. ఇక స్వస్థలానికి తిరిగి వెళ్లిపోవలసిన రోజు కూడా వచ్చింది. అందుచేత పట్టుబట్టి ఆ ఉదయం వెంకటేశాన్ని బయలుదేర తీశాడు. అతని దృష్టిలో సముద్రతీరానికి పోవటానికి వర్షమూ, ముసురూ, ఈదురుగాలీ - ఇలాంటివి ప్రతిబంధకాలు కానేకావు. పై పెచ్చు వర్షాసమయంలో సముద్రదేవత మరింత సౌందర్యాన్ని సంతరించుకొని- ఆతని కవిహృదయానికి అసాధారణమైన తృప్తిని కలిగించగలదనే ఆశ కూడా లేకపోలేదు.

సముద్రం ఇంకా రెండుమూడు ఫర్లాంగులుందనగానే 'రంయ్యో' మని హోరు వినిపించింది. రంగు రంగుల పిట్టలు కనిపించినవి. గోవిందు హృదయం మహానందంతో ఎగిరి గంతు వేసింది. ఆ సముద్రపు హోరులో - అనంతాకాశంలో గ్రహాల నిరంతర పరిభ్రమణంలో వెలువడే మధురాతి మధురమైన సంగీతాన్ని అతడు విన్నాడు.

అది ఒక చిన్నపల్లె. చెలియలికట్ట నానుకుని సముద్రం ఒడిలోఉన్న లక్ష్మీదేవిలాగ నిరంతరం కలకలలాడుతూ ఉంటుంది ఆ ఊరు. గోవిందు అత్తవారి అసలు స్వగ్రామం అదే! అక్కడ వాళ్ల కొక ఇల్లూ, ఒక తోటకూడా ఉన్నవి. ఆ ఇంటిని పాడుపెట్టి గోవిందు మామగారు పిల్లల చదువులనిమిత్తం 10, 15 ఏళ్లక్రితం దగ్గరలోఉన్న బస్తీకి కుటుంబాన్ని మార్చాడు. క్రమంగా అక్కడే ఒక ఇల్లూ అదీ కొనుక్కొని స్థిరపడిపోవటం జరిగింది.

పల్లెవాళ్ళ గుడిసెలతోసహా ఆ పల్లెలో రెండు మూడువందల గడపకంటె ఉండదు. సమీపంలో బస్తీలలో పెద్ద పెద్ద వాణిజ్య సంఘాలు స్థాపించుకున్న కొందరు తెల్లదొరలు తమ వేసంగి మకామునిమిత్తం చెలియలికట్టమీదనే రెండు మూడు బంగళాలు నిర్మించుకున్నారు.

బావమరదు లుభయులూ సముద్రతీరాన్ని చేరుకునేసరికి ఇంచుమించు తీరం నిర్మానుష్యంగా ఉంది. నీటిఅంచు చేరువనే చేపలు పట్టే తెప్పకొయ్యలు కొన్ని పడిఉన్నవి. దూరంగా సముద్రంమీద రెండు అలాంటి తెప్పకొయ్యలు కెరటాలతోపాటు ఉవ్వెత్తుగా పైకి లేస్తూ, చాపచుట్టగా క్రిందికి కూలుతూ, ఈ క్షణం కనిపిస్తూ, మరుక్షణం కనుమరుగవుతూ, ఒయ్యారంగా నాట్యంచేస్తూ తీరంవేపు వస్తున్నవి. రంగురంగుల పిట్టలు చిత్రచిత్రాల ఆరావాలు చేస్తూ పైని విచిత్ర చంక్రమణాలు చేస్తున్నవి. తీరాన సరుగుచెట్లలో గాలి రంయ్యన రొదచేస్తున్నది. తెల్లని పొగమంచు పడుతూ దూరభూరేఖ స్పష్టాస్పష్టంగా కనిపిస్తున్నది.

మానవజగత్తు సంకుచిత ఆవరణలనుంచి తప్పించుకుని భూగోళపు ఒక అంచుమీదికి వచ్చి నిలబడినట్లు భావించుకుంటూ గోవిందు ఒక దీర్ఘనిశ్వాసాన్ని విడిచాడు. రాత్రి అనకుండా, పగలనకుండా నిరంత

రాయంగా ఒక దానివెంట ఒకటిగా ఉబికి వచ్చే ఆ సముద్రతరంగాలను చూస్తూ అలా యుగాలకాలం గడిపివేయవచ్చు ననుకున్నాడు.

ఇంతలో - ఆకాశంలో మళ్లీ మేఘాలు గుంపులు గుంపులుగా చేరి గుజగుజలాడటం మొదలు పెట్టినవి. క్రమంగా సన్నని తుంపర కూడా సాగింది.

సముద్రపు సరదా తీరిందా బావా! ఇకనైనా ఇంటిముఖం పడతావా?" అన్నాడు వెంకటేశం వెటకారంగా.

సమాధానంగా గొడుగు విప్పాడు గోవిందు.

"ఎవరైనా చూస్తే నవ్విపోతారు బావా! ఈ వర్షంలో, ఈ ముసురులో ఈ బీచి షికారేమిటి?"

మరో ప్రపంచంలోనించి లాగ చూస్తూ గోవిందు ఏమీ బదులు చెప్పకుండా, అప్పుడే తెప్పకొయ్యలమీద ఒడ్డుకి చేరుకున్న పల్లెవాళ్లని చూసి ఒక్క నిట్టూర్పు విడిచాడు.

"సౌందర్యోపాసన బాగానే ఉంది కాని, బావా! ఈ చలికి ముందు నా ప్రాణాలు ఇక్కలాక్కుస్తున్నవి. వేడి వేడి కాఫీనీళ్లయినా దొరికి ఏడవవు - ఈ నిప్పచ్చరపు పల్లెటూళ్లో. ఇంతటనైనా ఇంటికి పోదాం నడుద్దూ" - అన్నాడు మళ్లీ వెంకటేశం.

వేడివేడి పానీయం ఏదైనా దొరికితే బాగుండునని గోవిందుకికూడా అనిపించింది. అదికాక - వాన జోరవుతున్నది. ఊళ్లోకి పోయి తలదాచుకోటంకంటె గత్యంతరం లేదు.

"కాఫీ కాకపోయినా, వేడి వేడి పాలైనా దొరకవచ్చురా నంకూ! ఊళ్లోకి పోతే" అన్నాడు గోవిందు.

ఇద్దరూ గొడుగులు వేసుకొని సైకిళ్లు నడిపించుకుంటూ ఊళ్లోకి బయలుదేరారు. శిథిలావస్థలో ఉండిన తమ ఇల్లుగల సందులోకే దారితీశాడు వెంకటేశం. తమ ఇంటికి నాలుగిళ్ల ఇవతలే ఒక పూరింట్లో గుమ్మంలో కూచ్చొని, బియ్యం ఏరుకుంటున్న ఒక వర్తకైవీళ్ల స్త్రీ వానలో సైకిళ్లను నడిపించుకుంటూ, గొడుగులక్రింద సగం సగం తడిసిపోతూ దారిని పోతూన్న వాళ్ళని ఆపి పలకరించింది. వర్షం వెలిసేదాకా తమ అరుగుమీద ఆగి వెళ్లమంది.

ఆమె కంఠంలో వినిపించిన ఆజ్ఞకాని ఆజ్ఞ - వాళ్లు సైకిళ్లను చూరుక్రిందికి జేర్చి, ఆ ఇంటి అరుగుమీదికి చేరుకునేట్టు చేసింది.

"ఏ ఊరు నాయనా! మనది...పాపం వర్షంలో బయలుదేరి వచ్చారు!" అంటూ ఆమె వాళ్ల జవాబుకోసం నిరీక్షించకుండానే-" అక్కర్ ! ఒక చాప తెచ్చి ఇలా అరుగుమీద వెయ్యమ్మా - కూర్చుంటారు పాపం!" అంది. పదమూడేళ్ళ ఒక కన్నె పడుచు సగం అల్లుకున్న జడని అలానే ఒక చేత్తో పట్టుకొనివచ్చి, రెండో చేత్తో చాప అరుగుమీద వేసి లోపలకు వెళ్లింది.

తలలు తుడుచుకుని, గొడుగులు విప్పి అరుగుమీద ఒక ప్రక్కగా ఆరబెట్టి, చాపమీద సర్దుకుని కూచున్న వెంటనే వెంకటేశం అడిగాడు: "ఈ ఊళ్ళో అమ్మకానికి పాలు ఎక్కడైనా దొరుకుతాయండీ?"

"కాఫీలకోసమా నాయనా! పాపం బస్తీ వాళ్ల లాగున్నారు. కాఫీ మా ఇంట్లో పెట్టించి ఇప్పిస్తాలెండి" అంటూ కూతురిని పిలిచి, "కుంపట్లో కాస్త డికాషన్ పెట్టి కాఫీ కలిపి ఇయ్యమ్మా! వీరెవరో పాపం మరి దెబ్బతిని వచ్చారు - గొప్ప ఇంటి బిడ్డల్లాగున్నారు" అంది ఆమె.

గోవిందుకి ఆమె ప్రవర్తన ఏమీ అర్థం కాలేదు. తామెవరో ముక్కూ మొగమూ కూడా ఆమె ఎరుగదు. ఆమె ఆదరణా, మాటమాటలోను ధ్వనిస్తూన్న ఆమె ప్రేమా చూచి అతనికి అమితమైన ఆశ్చర్యం కలిగింది. ఆమెతో ఇలా అన్నాడు: "మీకు అనవసరపు ఇబ్బంది కలిగించటం నాకు ఇష్టం లేదండి...పాలు, పంచదార, కాఫీపొడుందొరికే చోటు చెప్పండి-నేను వెళ్లి తీసుకువస్తాను; మీరు కాఫీ కాచిపెడుదురుగాని, అదే మాకు పదివేలు."

అంతవరకూ సాధువుగా మాట్లాడుతూన్న ఆమె అల్లా గోవిందు మాటలికి ఒక్కసారిగా ఎక్కడలేని కోపం తెచ్చుకుని, "చాలుచాల్లే అబ్బాయి! మీ బస్తీ గడుసుతనాలు నా దగ్గిర పనికిరావు. ఇంటికి వచ్చిన వాళ్లకి కాసిని కాఫీనీళ్లయినా ఇచ్చేగతి లేకపోలేదులే మాకు-మేమెంత పల్లెటూరివాళ్లమైనా!..." అంటూ కేకలు పెట్టింది.

రంగం చెడగొడుతున్నాడని బావగారికేసి కోపంగా చూస్తున్నాడు వెంకటేశం. అంత స్వతంత్రంగా ఆ పరాయి ఇల్లాలు తమను కూకలు వేయటం, ఆ మందలింపులో కూడా వాత్సల్యమే స్ఫురిస్తూ ఉండటం చూచి చిన్నప్పుడెప్పుడో చనిపోయిన తన తల్లి జ్ఞాపకంవచ్చి గోవిందుకన్నులు చెమ్మగిల్లినవి.



"మీరు చిన్నపిల్లలు నాయనా! మీకు తెలియదు. నేను చెప్పినట్టు మాట్లాడకుండా వినండి..." అంటూ క్షణంలో గొంతులోని కాఠిన్యాన్ని మటుమాయం చేసి మళ్లీ మృదువుగా మాట్లాడసాగింది... "పంచదారమాత్రం ఈ ఊళ్ళో బొత్తిగా దొరకటం లేదు నాయనా! మాతోపాటు ఇంత బెల్లపుకాఫీయే కలిపించి ఇస్తాను. అది గొంతులో పోసుకుని,—అప్పటికి బాధా కొంత తగ్గుతుంది - మీ పనిమీద మీరు వెళ్లుదురు గాని..."

ఆమె మాట మాటా అమృతంలో ముంచి తీసినట్లు గోవిందు చెవులలో మధురాతి మధురంగా వినిపిస్తూంది. మాతృవాత్సల్యం చవిచూచి ఎరుగని గోవిందుకి, మానవ సమాజ విద్వేషిఅయిన గోవిందుకి ఆ మారుమూల పల్లెటూళ్ళో ఆ ప్రేమమయమూర్తి సందర్శనంవల్ల కలిగినంతటి ఆశ్చర్యం, ఆనందం, - అతను మొట్టమొదటిసారి సముద్రాన్ని చూసినప్పుడు కూడా కలుగలేదు.

కాసేపు ఆగి ఆమె మళ్లీ—"అయితే, నాయనా! మనది ఏ ఊరో, ఏం పనిమీద ఇలా వచ్చారో చెప్పనేలేదు?" అంది.

ఆమెతో సంభాషణ పొడిగించే అవకాశంకోసం కనిపెట్టుకుని చూస్తూన్న గోవిందు వెంటనే తన మామగారిది అసలు ఆ ఊరే ననీ, పేరు ఫలానా అనీ, ప్రస్తుతం వాళ్లు ఫలానాచోట ఉంటున్నారనీ, ఆ వీధిలోనే తన మామగారి ఇల్లుకూడా ఉందనీ - విషయమంతా వివరంగా చెప్పాడు.

రెండు నిమిషాలసేపు వెంకటేశం కేసి పరకాయించి చూసి, ఆమె "అయితే, ఈ కుర్రాడు మా రంగమ్మ కొడుకా ఏమిటి?" అంది. "ఎన్నో వాడివిరా, మూడో వాడివా?" అంది. ఆ తురక ఇల్లాలు అలా తనని ఏకవచన ప్రయోగం చేస్తున్నందుకు ముఖం చిట్లిస్తూ వెంకటేశం ఔనని తల ఊపాడు. ఇక - ఆమె గుక్క తిప్పుకోకుండా ఒక ప్రశ్నల వర్షం వాళ్లమీద కురిపించింది.

రంగమ్మకి వెంకటేశం తరువాత ఒక ఆడపిల్ల పుట్టిపోయిందని తను విన్నది. అంతేనా - అటుతరవాత మళ్ళీ ఏమైనా సంతానం కలిగారా? వాళ్ల పెద్ద పిల్లకి తమ ఊరువిడిచి వెళ్లేనాటికి ఒక మగపిల్లవాడు. వాడు ఖులాసాగా ఆడుకుంటున్నాడా? అటు తరువాత ఏమైనా పిల్లలా? రంగమ్మ ఎన్నో కూతుర్ని గోవిందుకి ఇచ్చారు? మిగతా ఆడపిల్లలకు కూడా పెళ్లిళ్లు అయినవా? అన్నట్టు రంగమ్మ ఆడబిడ్డ ఖులాపాయేనా? రంగమ్మ తోటికోడలూ, మరదీ, వస్తూ పోతూ ఉన్నారా? వెనకటి మన స్పర్ధలన్నీ సర్దుకొనిపోయినవా?.........ఇలా ప్రశ్న మీద ప్రశ్నగా ఆ కుర్రవాళ్ళకి ఊపిరి సలుపకుండా ఆమె అడిగింది.

ఆ ప్రశ్నలకు సమాధానాలుగా సంతోషకరమైన వార్తలు చెవినిపడినప్పుడు ఆమె ముఖం చేటంత అయింది. విషాద వార్తలకు ఆమె కన్నులు చెమ్మగిల్లినవి. ముఖ్యంగా రంగమ్మ ఆడబిడ్డ కాలంచేసిందని విన్నప్పుడు ఆమె పరితాపం చెప్ప నలవికాదు. రంగమ్మకీ తనకీ తగని స్నేహం. ఎప్పుడూ తమ ఇంట్లోనే ఉండేది. రంగమ్మ ముచ్చట్లన్నీ స్మరించి, ఒక్క నిట్టూర్పు విడుస్తూ అంది: "చిన్నతనంలోనే తలమాసినా - పాపం! ఎంతో బుద్ధిమంతురాలని పేరు తెచ్చుకుంది."

ఇంతలో కాఫీ కలిపి లోపలినుంచి అక్తర్ తల్లిని కేక వేసింది. "కలపటం అయితే రెండు గ్లాసుల్లోపోసి ఇలా తీసుకురా అమ్మా!" అంది లోపలికి తొంగి చూస్తూ తల్లి. బాల్యయౌవనాల సంధ్యారక్తిమతో ఎరుపెక్కిన కపోలాలతో ఆ కన్నెపడుచు 'నువ్వే తీసుకొని వెళ్లుమా' అన్నట్టు చేతులతో తల్లికి సంజ్ఞచేసింది. తల్లి నవ్వుతూ "వెర్రిపిల్లా! సిగ్గెందుకు? అన్నయ్య కాదూ వెంకన్న నీకు? ఇలా తీసుకురా ఫరవాలేదు" అంది. సిగ్గుపడుతూనే అక్తర్ కాఫీగిన్నె ఒక గుడ్డతో పట్టుకొని తెచ్చి అరుగుమీదపెట్టి, రెండు గ్లాసులు కూడా ప్రక్కన ఉంచి, గిరుక్కున తిరిగి లోపలికి వెళ్లిపోయింది.

తల్లి ఆమె సిగ్గుచూసి నవ్వుతూ, చిన్నప్పుడు అక్తర్ ఒక్క క్షణం కూడా వెంకు అన్నయ్యని ఎలా విడిచి ఉండేది కాదో, వెంకయ్య ఎంతెంత దుండగపు పనులు చేసేవాడో అన్నీ ఏకరువుపెట్టింది.

అచ్చమైన ప్రేమతో తడిసిన ఆమె మాటలు వింటున్న గోవిందుకి త్రాగుతూన్న కాఫీ అమృతాయమానంగా అనిపించింది. మొదట సముద్రపు ఒడ్డునుంచి కాఫీకోసం ఊళ్ళోకి వచ్చేటప్పుడు గోవిందు వర్షం కాస్త తెరపిఇస్తే మళ్ళీ సముద్రపు ఒడ్డుకి వెళ్ళి, ప్రకృతిసౌందర్యాన్ని మరి కొంతసేపు ఆస్వాదనచేసి మరీ ఇంటికిపోదామనుకున్నాడు. కాని, ఇప్పుడు సముద్రతీర దృశ్యంమీద అతనికి వాంఛ సన్నగిలింది. సముద్రంకంటె విశాలమైన ప్రగాఢమైన తత్వం మానవప్రకృతిలో అతనికి ప్రత్యక్షమైంది. తాము ఇంటికి తిరిగి వెళ్లవలెనని గాని, ఆనాడే తాను తన స్వస్థలానికి ప్రయాణం కూడా పెట్టుకున్న సంగతి గాని-ఏవిషయమూ అతనికి గుర్తులో లేదు.

"ప్రొద్దెక్కుతూంది బావా! ఇంక బయలుదేరుదాం. వర్షం కాస్త తెరిపి ఇచ్చింది కూడాను!" అంటూ వెంకటేశం మధుర స్వప్నంలోనుంచి బావగారిని మేలుకొలిపాడు. గోవిందు ఒక్క నిట్టూర్పు విడుస్తూ అనిష్టంగానే లేచి, "మేము ఇక వెళ్లివస్తామండీ పిన్నిగారూ!" అంటూ గొడుగు ముడిచి సైకిలుకి తగిలించి ప్రయాణ సన్నాహం చేశాడు.

"ఇంత ప్రొద్దెక్కి ఇప్పుడేమి వెళుతారు నాయనా! కరణంగారి ఇంట్లో చెబుతాను. భోజనం చేసి నిదానంగా వెళ్లరాదూ?" అంది ఆమె. ఆ ఆదరణకూ, నిసర్గమైన ప్రేమకూ గోవిందు కన్నులు చెమ్మగిల్లినవి. తన కానాడు అక్కడ ఉండిపోవలననే ఉన్నా, అప్పటికప్పుడే సైకిలు అధిరోహించే ప్రయత్నంలో ఉన్న వెంకటేశాన్ని చూచి, ఆ ఊహ విరమించుకున్నాడు." ...క్షమించండి, మరొకప్పుడు వస్తాంగదా - మా వాళ్లు ఎదురుచూస్తూవుంటారు..." అన్నాడు.

"సరే నాయనా! అలాఅయితే త్వరగా వెళ్లండి. మళ్లీ భోజనానికి ప్రొద్దెక్కుతుంది" అంటూ ఆమె వెంకటేశాన్ని లోపలికి పిల్చి, ఒక బుట్టలో జీడిమామిడి పళ్లూ, ముళ్లగోరింట పువ్వులూ కట్టి ఇచ్చి వాడు "ఇవన్నీ ఏమిటండీ - వద్దండీ అంటున్నా వినిపించుకోకుండా, "ఇవి మీ అమ్మకిచ్చి, 'నీచెల్లెలు పాపాబీగం చచ్చిపోయిందనుకున్నావా? ఒక్కసారి అయినా మళ్ళీ వచ్చి చూశావు కాదు!' అన్నానని చెప్పరా - మీ అమ్మతో" అంది.

తిరిగివస్తూ, దారిపొడుగునా ప్రేమమయి అయిన ఆ ముస్లిం కాంత మాటలే మననం చేసుకుంటూ, "ఇంతేనటే సముద్రమెంతో అనుకొంటి" అన్న రొంకిపాట పల్లవిని గొణుక్కుంటూన్న గోవిందుకి వెంకటేశం చెప్పుకుపోతూన్న తన స్కూలు విశేషాల్లో ఒక్కటీ చెవిని పడలేదు. ★

# ఉద్యోగి

"శివశ్రీ"

రాత్రి ఎనిమిది గంటలయినా మూర్తి ఇంటికి రాకపోవడం శాంతకు అనుమానం కలుగజేసింది. ఏనాడూ ఆఫీసునుండి అంతవరకూ రాకుండా లేదు. పైగా తన ప్రయాణం దగ్గరకు వస్తూన్న కారణంచేత తనకు తేవలసిన వస్తువులను గురించి పదే పదే ప్రస్తావించటం అతని మనస్సుకు బాధను కల్గించలేదుకదా!

మూర్తి జిల్లా టెక్స్‌టయిల్ ఆఫీసరు. నెలకు మూడు వందలు దాకా ముట్టూ ఉన్నా లంచాలు ఏమీ పుచ్చుకోక పోవడంవల్ల సంసారం నెగ్గడం చాలా కష్టంగా ఉంది. తన కళ్ళముందు ఎంతో మంది ఉద్యోగులు లంచాలు పుచ్చుకోడంవల్ల చాలా ఆస్తి సంపాదించడం చూస్తూనే ఉన్నాడు. అయినా సిద్ధాంతానికి కట్టుబడి ఉండటంవల్ల అతను ఎవర్నీ దగ్గరకు రానీయడంలేదు. ఈపద్ధతి అవలంబించడంవల్ల మూర్తిని పొగడినవాళ్ళూ ఉన్నారు, నిరసించినవాళ్ళూ ఉన్నారు. నిరసించిన వాళ్ళే ఎక్కువేమో. ఎందుకంటే నాలుగు రూపాయలు పోయినా పని జరుగుతుందనే నమ్మకం ఉంది.

మూర్తి జీతం చాలక పోవడంవల్ల ఖర్చు తగ్గించుకోవాలనుకున్నాడు కొన్నాళ్ళు. 'పిండి కొద్దీ రొట్టె' అని చిన్ననాడు చదివిన సామెతను అమలు పరుప చూశాడు. కాని చేత కాలేదు. ఎంగులో తగ్గించగలడు? తన ఉద్యోగానికి సరిపోయిన హోదా ఇంటా బయటా లేకుంటే వీల్లేదనే మనిషి అతను.

భార్యను మూడు రోజుల్లో పురుటికి పుట్టింటికి పంపించాలి. ఆవిడకు తన ఉద్యోగ కాలంలో ఒక్క నగయినా చేయించి పెట్టలేదు సరిగదా, చేయించి పెట్టమని మామగారు ఇచ్చిన వెయ్యిరూపాయలు గుటకాయి స్వాహా చేశాడు. ఆ నాటి ఉదయం తాను ఆఫీసుకు బయలుదేరే ముందు భార్య తాంబూలం అందిస్తూ 'నాకు కావలసిన వస్తువులన్నీ సమకూర్చలేకపోతే పోయారు. కనీసం మెళ్ళో గొలుసుకు అతుకు వేయించడం, పెరిగిపోయిన నల్లపూసలకు తీగ చుట్టించవడం, పాప, చేతులకు మురుగులు చేయించడం, రెండు చీరలు నాకు నాలుగు గౌనులు పాపకు సమకూరేట్టుగా చూడండి' అని చెప్పిన మాటలు తన చెవిలో మారు మ్రోగుతూండడం చేతే ఏమీ నిర్ణయం చేయలేని స్థితిలో బీచ్ ఒడ్డున ఆ రోజున ఎనిమిది గంటలదాకా ఉన్నాడు.

సుబ్బరాజు ఆనాడు తనకు ఇవ్వబోయిన వెయ్యి రూపాయల లంచం కటిక్కున పుచ్చుకున్నట్లయితే ఈ బాధంతా తీరిపోయేనా? నిరాకరించాడు. ఎవరికో ఒకరికి ఆ పదివేల రూపాయల కోటా వెయ్యవలసిందేనాయె. అదే సుబ్బయ్యకు వేస్తే వెయ్యి రూపాయలు వచ్చేవా? అంగులో సుబ్బయ్య వట్టి పిరికి పంద. ఎదురు వ్యవహారం నడిపించే ధైర్యంలేని మనిషాయె.

భార్యకోరిన వేమీ లేకుండా పుట్టింటికి పంపడం భార్య ఒక్కతెకు కాకుండా తనకూ తలవంపులే. జిల్లా ఉద్యోగి అయి ఉండి భార్య మెడలోని పుస్తెలతాటిని కట్టించలేని ఉద్యోగి ఏం ఉద్యోగి?

తన మనోవ్యధను భార్యకు తెల్పి ఆవిడనుకూడా బాధించడం అతనికి ఇష్టంలేదు. అందుకని ఆ రాత్రి వచ్చీరావడంతోటే వెధవ ఉద్యోగం ఎప్పుడూ ఎవడో ఒకడు రావడం ఆలెక్కలుతియ్యి, ఈ లెఖ్ఖలు తియ్యి అనడం. వంగినవాడ్ని మరీ వంచుతారు...' అని తన ఆలస్యానికి కారణం ఎవరో పై అధికారి రావడం అనిశాంత అనుకునేటట్లు ప్రవర్తించాడు.

అయినా శాంత మూర్తి చికాకుగా ఉన్నట్లు తెలుసుకొని తన విషయం ప్రస్తావించనేలేదు. భర్త మనస్సు కుదటపడేందుకు అనేక శీతలోపచారాలు చేసింది. కాని మూర్తి వ్యధ మాత్రం తగ్గలేదు. శాంతలాంటి భార్య కోరికనా ఒక జిల్లా ఉద్యోగి అయిన భర్త నెరవేర్చ లేనిది? రాత్రి పదకొండు గంటలయింది. పడుకోబోతూ శాంత ముఖంలోకి చూస్తూ 'శాంతా చెప్పడం మరచా. నీవు ఉదయం చెప్పిన వాటికన్నిటికీ షాపులో ఆర్డరిచ్చాను. ఎల్లుండికల్లా అన్నీ సిద్ధం' అన్నాడు. శాంత ముఖం విప్పారడం చూచి మూర్తి సంతోషించాడు.

ఉదయం కాఫీ త్రాగి కుర్చీలో కూర్చుని బ్లిట్జ్ చూస్తూన్న మూర్తి కండ్లు అప్రయత్నంగా ఎడిటర్‌కు పాఠకుడొకడు వేసిన ప్రశ్న వైపు పోయింది.

'ఎడిటర్ జీ డబ్బు బాగా సంపాదించాలంటే ఏం చెయ్యాలి?

'నీతి నియమాలు ఒదలాలి.'

నిజం కూడా అంతే. కలికాలంలో అవినీతికి ఉన్నంత విలువ నీతికి లేదు. నీతివంతంగా ఇన్నాళ్ళు పనిచేసిన మూర్తికి ఎట్టి ప్రమోషన్ లేదు. అవినీతిపరుడై, లంచగొండైనా సూర్యం అప్పుడే పై ఆఫీసరై కూర్చున్నాడు.

శాంత ప్రయాణానికి ఏర్పాటులు అన్నీ జరిగిపోయినాయి. కాని శాంతకు మాత్రం మూర్తి డబ్బు ఎట్లా తేగలడా అనే సంశయం మాత్రం పోలేదు. తన కొరకు అవినీతిపరుడు కాడుగదా? అట్లా అనుకొనేందుకు మూర్తి విషయంలో వీల్లేదు. కాని భర్త ముఖంలో అప్పుడప్పుడు కన్పించే ఆవేద చిహ్నాలకు మాత్రం అర్థం చెప్పుకోలేక పోయింది. విషయం తెల్సుకుందామనే తలంపుతో మామూలు ప్రకారం భోజనానంతరం దినపత్రిక చదివి వినిపించి అందులో లేని విషయాన్ని ఓదాన్ని ఉన్నట్టుగా చదివింది. సారాంశం దూరదేశంలో ఒ టెక్స్‌టయిల్ ఆఫీసరు లంచం పుచ్చుకొన్నందుకు బర్తరఫ్ అయినట్లు. మూర్తి 'అవవలసిందే. బర్తరఫే కాదు మరణశిక్ష విధించాలి' అన్నాడు. శాంత అనుమానాన్ని భర్తసమాధానం పటాపంచలు చేసింది.

ఆ నాటి సాయంత్రం సరిగ్గా అయిదు కొట్టే సరికల్లా మూర్తి ఇంటికి రావడం శాంతకు ఆశ్చర్యాన్ని కలుగజేసింది. మూర్తి వెనకాలే వచ్చిన బంట్రోతు శాంత కోరిన వస్తువులను పుచ్చుకురావడం శాంతకు కల్గిన ఆశ్చర్యాన్ని రెండింతలు చేసింది.

మర్నాడు ఉదయం శాంత ప్రయాణం నిర్విఘ్నంగా సాగింది. రెండు నెలలు ఉండి శాంత ఓ చిన్న పాపాయిని ఎత్తుకుని తిరిగి వచ్చింది.

వచ్చీరావడంతోటే మూర్తి ఆజిల్లానుండి ఇంకో జిల్లాకు బదిలీ చేయించుకోవాలని ప్రయత్నిస్తూన్నట్లు విన్నది శాంత. కారణం తెలియలేదు. ఆనాడు మూర్తి గుడ్డలు

(19-వ పేజీ చూడండి)

# తరంలో అంతరం

## 1

సుబ్బారావు భార్య చనిపోయింది. పసికూనల్ని శపించినట్లు తనమీద పారవేసి, తన భవిష్యత్తును అయోమయం చేసి ఈ లోకంలోంచి నిర్గమించింది అతని భార్య. రెండవపెళ్ళి ప్రస్తావన వచ్చింది. అతనికి తల సెరవలేదు. ఈడుచూస్తే మూడు పుష్కరాలకు లోపే!

సుబ్బారావు చదువుకున్నవాడూ సంస్కారీకాడు! - చనిపోతూ, ఆఖరి కోర్కగా భార్యనిర్బంధించలేదు అతన్ని - అయినా ఎవరెన్ని చెప్పినా మారుమనువు వల్లకాదన్నాడు. అనుకున్న తర్వాత ఏనాడూ మాటతప్పి ఎరగడు. చివరకు, విసిగిపోయి, పరామర్శకు వచ్చిన చుట్టపక్కాలంతా జారుకున్నారు.

* * *

తన తాహతుకు, తన వాతావరణానికీ సుబ్బారావుకు పెళ్లిచేసుకునేందుకు ఎన్ని అవకాశాలు, ఆశలు వున్నాయో, అదే నిష్పత్తిలో అనుమానాలు, నిరాశా గూడా లేకపోలేదు! అయితే--మనిషి-అన్న తర్వాత, ఆపేక్ష, అంతఃకరణలు వున్నంతవరకూ, వాటిని నమ్ముకున్నంతవరకూ సుబ్బారావుకు, తన పిల్లల సుఖం చూడదల్చుకుంటే-వారి క్షేమమే తన క్షేమం అనుకుంటే - ఎంతమాత్రం పెండ్లిచేసుకోగూడ దనిపించింది.

...నిజానికి తన పొరుగునవున్న ముసలి రంగయ్య దాంపత్యం తనకి ఒక గుణపాఠం. వాళ్ళిద్దరూ ప్రతి చిన్న విషయంలోనూ దొమ్ములాడుకు ఛస్తుంటే తనకి ఎన్నిసార్లు నిద్రాభంగం కాలేదు! ఇంటిపెత్తనం సౌత్తినవేసుకు యీదుతోంది. అందులో-చిన్నపెళ్లాం, ఇక నోరెత్తటానికి వీలుందా! ఎన్నింటికి తమాయించుకున్నా - తన మొదటిభార్య కూతురు విషయంలో మాత్రం - గుండె నిలవక నోరు చేసుకుంటాడు రంగయ్య! అది ఏజోలీ ఎరుగని పిల్ల, అసలె ముండమోసి, సంఘంలో హీనంగా పడివున్నదాన్ని, దాని మానాన దాన్ని పోనీయక 'ఏదో రెచ్చగొట్టి దాంతో కీచులాట పెట్టుకుంటుంది.

ఆ పిల్లకు తనుమాత్రం ఏం అన్యాయం తలపెట్టాడు? నిక్షేపంలాంటి మోతుబరి కొడుకొక్కయిచ్చి తన కున్నంతలో బాగానే జరిపించాడు పెళ్లి. పెళ్లికొడుకు ఊచలాగా నాజూకైనవాడే కాకుండా మొహంలో కళవుంది. అన్నమ్మ అదృష్టవంతురాలు అన్నారు. "అదుగో పసుపు ఇదుగో ముసుగు" అన్నట్లయింది చివరకు. శోభనం ముహూర్తం మరో వారం వుందనగా పాము కరిచి చచ్చిపోయాడని వార్తవచ్చింది. అంతా లబోదిబోమన్నారు. ఎవరికి వారు, దేముడ్ని, విధిని తిట్టితిట్టి విసిగి వుపశమనం పొందారు. అంతలోనే పిల్లను ఇక్కడ వుంచటమా అక్కడ వుంచటమా అన్న మాటమీద పేచీవచ్చి అదంతా ఒక పెద్దరగడై—చివరికి ఎనోవర్తన్నా లేకుండా పుట్టింటనే పడి వుంటోంది అన్నమ్మ! కడుపు తీపెవల్ల, కలిగిన అన్యాయానికి జాలివల్లా—అన్నమ్మమీద ప్రేమ కరుణ రంగయ్యచూపితే-అది ఎంత మాత్రం చిన్న భార్యకు గిట్టదు...అందువల్ల తను కల్పించుకుని మాట మిగలవలసి వస్తుంది. ఇదీ ఆ సంసారం!

## 2

అసలు సుబ్బారావుభార్యకూ అన్నమ్మకూ పూర్వంనుంచీ స్నేహం. సుబ్బారావు తెల్లారి ఏడింటికిలేచి పనిలోకి పోతే, తిరిగి రాత్రి ఏడింటి దాకా ఇంటి ముఖం పట్టేవాడు కాదు. అందువల్ల పగలల్లా అన్నమ్మా సుబ్బారావు భార్యా కలిసి మెలిసి వుండేవారు. ఈ జోస్తీవల్లనే జబ్బుచేసిన మొదటి రోజుల్నుండి చివరవరకూ సుబ్బారావు భార్యకు అన్నమ్మ-తన సుఖం చూచుకోకుండా కష్టపడి వుపచారం చేసింది. ఏ రోజు మానితే ఆ రోజు జీతం విరగగోసే కంపెనీ వుద్యోగంలోవుంటూ-భార్య విషయంలో గగ్గోలుపడుతున్న సుబ్బారావుకు అన్నమ్మ దేవతలాగా ఆదుకుంది. ఆమె ఋణం తను ఎలా తీర్చుకోగలడో తనైనా అంత చాకిరీ చేసివచ్చి గూడా కన్నుమూసి ఎరగకుండా తన భార్యకు వుపచారం చేశాడు. ఒకొక్కరోజున సుబ్బారావు వచ్చేటప్పటికి చీకటిపడేది. అలాంటపుడు అన్నమ్మ యింటికి వెళ్లిపోవాల్సిందే! కాని బాధపడుతున్న రోగిని చూస్తూ చూస్తూ వదిలి రావటానికి కాళ్లు ఆడేవికావు. ఇలా ఆలస్యమైననాడు సవతితల్లి మరీ రెచ్చేది! "అచ్చోసిన ఆంబోతల్లె ఎవడివెంట తిరుగుతున్నావే ఇంత రాత్రిదాకా" అంటూ చాలా పరుషంగా తిట్టేది. అయినప్పటికీ అన్నింటినీ దిగమింగి స్నేహితురాలికోసం శాయశక్తులా తంటాలు పడింది. కాని కృషికి తగినఫలం గూడా మన సొత్తు కాదన్నట్లు - భగవంతుడు మాత్రం సుబ్బారావు భార్యను ఎత్తుకు చక్కాపోయాడు!

* * *

పరంపరలుగా రావటం కష్టాలవంతు. వాట్లని తట్టుకోవలసిన బాధ్యత మాత్రం మనుష్యులవంతు. సుబ్బారావుకు ఎంత దీర్ఘంగా ఆలోచించినా తన జీవితాన్ని, తన భవిష్యత్తును కటికచీకటి ఆవరించి వుంది. తను సుఖపడేందుకు పుట్టలేదని తన ముఖాన ఏనాడో వ్రాసిపెట్టివుంది. ఈ నాడు తప్పేదికాదది! ఇన్నాళ్లూ నామమాత్రంగా తన భార్య - మంచంలో అంటూ - వుండటంవల్ల ఆమెకోసం అన్నమ్మ వస్తూవుండటం, తన భార్య, పిల్లలు, ఇల్లు ఇవన్నీ చూసుకు సర్దుకుపోతూవుండేది. కాని ఇక అన్నమ్మ రావటానికి వీలులేదు. తన భార్య బ్రతికివున్న రోజుల్లోనే ఎర్రగుడ్లను మిటకరించిన ఆ గూడెం ఇప్పుడు తన యింట్లో అన్నమ్మ అడుగుపెడితే వూరుకుంటుందా?

సుబ్బారావు వొంటరిగాడు అయిన మొదటిరోజునుంచీ అతని దినచర్య పూర్తిగా మారిపోయింది. చీకటితో లేచి పొయ్యివెలిగించి ఎత్తెసరు పొయ్యిమీదకి ఎక్కించి, తను మొహం కడుక్కుని పిల్లలిద్దరికీ ముఖాలు కడిగి నీళ్లు పోశాడు. ఆ పిల్లలిద్దర్ని తనకంచం చుట్టూ కూర్చోపెట్టుకుని తను, గతికే నాలుగు ముద్దల్లోనే వాళ్ల కడుపులు గూడా నింపి వాళ్లకు లాగూ చొక్కాలు తొడిగి తను బట్టలు వేసుకున్నాడు - మరి తను కంపెనీకి వెళ్లిపోవాలి-ఒక్కక్షణం ఆలస్యం అవటానికి వీలులేదు. మరి ఈ పిల్లల గతేమిటి? అందులో, కాలువ నాళ్లు - కంటిరెప్పలవలె కాపాడకపోతే ఏ సందులు తిరిగి దారి తప్పుతారో?

శ్రీ రాళ్లబండి నరసింహమూర్తి

అసలే తల్లికోసం బెంగపెట్టుకుని వున్నారు. అన్నమ్మదగ్గర అలవాటే గాని - ఆమెకు వప్పజెప్పితే తనకు ఆ వాడలో నిలువనీడ వుండదు.

తప్పనిసరిగా ప్రక్కింటి రాముల్ని అడిగాడు "బాబాయ్! నా గతి యిట్టా కాలిపోయిందిగదా!- ఈ పసికూనల్ని మీలాంటి వాళ్లు చేరదీయకపోతే..." బావురుమన్నాడు సుబ్బారావు. రాములుది మాత్రం గుండె కాదూ? రాములు మాత్రం సుబ్బారావుకు పొరుగువాడు కాదా? రాములుకు కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. 'సుబ్బారావు బుజం మీద చెయ్యివేసి - ఈ మాత్రానికే ప్రాధేయపడాలా సుబ్బారావ్? పొరుగున వున్న వాళ్లం మేంకాక ఇంకెవరు చూస్తారు?"- అని భార్యని పిల్చి పిల్లల్ని వప్పజెప్పాడు. అప్పటికి మతి స్థిమితం చేసుకుని కంపెనీకి వెళ్లాడు సుబ్బారావు. అయిన పది నిమిషాల ఆలస్యానికే వడ్డీతో సహా చీవాట్లు తిన్నాడు. అవును. కుర్రాళ్లను సరిదిద్దవలసిన తను ఆలస్యంగా రావటం ధర్మం కాదూ? కాని తన వ్యథ ఎవరికి తెలుసు?

* * *

వారంరోజులు తిరగ్గానే సుబ్బారావు ఒక మెషిన్ అయిపోయాడు. తెల్లారగానే గబగబా లేవటం - అన్నం వండి తను తిని వాళ్లకు పెట్టటం. కంపెనీకి పోవటం - తిరిగి సాయంత్రం - వంట, పిల్లల పని, తిండి, నిద్ర! ఈ దినచర్యలోనే సతమతమవుతున్న సుబ్బారావు జీవితం మానవత్వాన్నే కోలుపోయింది!

## 3

ఆనాడు పనివత్తిడి కంపెనీలో ఎక్కువ అయింది. పెద్దమూసపెట్టి లోహం కరగవలసి వచ్చింది. లోహం కరిగి నిప్పులు కక్కుతోంది. మూసలోకి మరికొన్ని ముక్కలు దింపుతున్నాడు. అంతలో పట్టు తప్పి చెయిజారి లోహం ముక్క మూసలోపడింది. దాంతో కరిగిన లోహం పైకి చింది అతని వళ్లు తూట్లుపడిపోయింది. స్పృహతప్పిపడిపోయాడు. ఆస్పత్రిలో జేర్చారు అతన్ని. వారం రోజుల్లోపల అతను తేరుకోగలడని హామీ యివ్వలేం అన్నారు డాక్టర్లు. ఆ వెర్రిమైకంలో నే-పిల్లల్ని గురించి, వాళ్ళ తిండితిప్పలుగురించీ ఒకటే కలవరింతలు.

మర్నాడుప్రొద్దున రాములు పిల్లలిద్దర్ని వెంటపెట్టుకుని ఆస్పత్రికి వచ్చాడు. అతన్ని చూడగానే పిల్లలు ఆవురుమని ఏడ్చారు. ఈనాన్న లేకపోతే వాళ్లకు రోజు గడవదు. ఈ నాన్న తప్ప ఈ లోకంలో వాళ్లకు దిక్కెవరున్నారూ?

ఈ కారణంగా తన కన్నో, కాలో, చెయ్యో పోయి, అవిటివాడు కాకుండా అదృష్టవశాత్తు - బ్రతికి బయటపడ్డాడు సుబ్బారావు. ఇక రేపోమాపో ఆస్పత్రిలోంచి విడుదలచేస్తామంటున్నారు. అదేమి! రోజూ రావల్సినవేళకు రాములు రాలేదు. చాలా ఆలస్యంగా వచ్చాడు. రాములు ముఖం చాలా వికృతంగా వుంది. ప్రక్కన కొంగు పట్టుకుని పెద్ద పిల్లవాడు నుంచున్నాడు ఏడుస్తూ. ఇదంతా సుబ్బారావుకు అయోమయంగా వుంది. ఏం జరిగిందో పాలుపోవటంలేదు. దుఃఖం పొంగిపోతూ "నీ చంటిపిల్లవాడ్ని పొట్టనపెట్టుకున్నాను సుబ్బారావ్" అని ఏడ్చాడు. సుబ్బారావుకేమీ బోధపడటం లేదు. భరించలేకపోయాడు. "ఏం జరిగింది రాములూ? సూటిగా చెప్పు! ఏంజరిగింది?" అని అడిగాడు ఒణుకుతూ. "ఏం చెప్పను? ఆస్పత్రి దగ్గరఅయితే వాడికి కాలునిలవదు. రోజూ జాగ్రత్త పడేవాడ్ని. ఇవాళ దూసుకుపోయాడు. తొందరలో బండి క్రింద పడ్డాడు. చక్రంపైనించి పోయింది. ఆస్పత్రిలో జేర్చాం. మన స్పృహలో లేడు. డాక్టర్లు కూడా ఫర్వాలేదని చెప్పలేకపోతున్నారు..."ఇంతకూ నా చేతిలో పెట్టావు వాళ్ళని సుబ్బారావ్ - మాట దక్కించుకోలేకపోయాను." అని బావురుమన్నాడు, రాములు. సుబ్బారావు ఆ దుఃఖోన్మాదంలో పిచ్చివాడల్లే వెర్రిచూపులు చూస్తూ విన్నాడు. ఏమీ మాట్లాడలేని బలహీనతలో పడిపోయాడు. ఆరోజో, మర్నాడో ఆస్పత్రిలోంచి విడుదల కావల్సిన సుబ్బారావుపరిస్థితి చూచి మరి వారంరోజులు దాకా ఇక్కడే వుండాలన్నాడు డాక్టరు.

ఆరెండు రోజులూ పిల్లవానికోసం ఎంత మనోవ్యధను అనుభవించాడో తెలియదు. సుబ్బారావు రూపే సుబ్బారావులో లేకుండా పోయింది. మర్నాడు ఉదయం పిల్లవాడు చనిపోయాడన్నవార్త విని అతను చలించలేదు. కారణం - అతని దృష్టిలో పిల్లవాడు మొన్ననే చనిపోయాడు. తన శక్తికొలది - తన పేగులు పట్టినంతవరకూ పిల్లవానికోసం దుఃఖించటం అయిపోయింది. దానితో ఆ పుత్ర పితృరుణాలు తీరిపోయాయి. అతని దృష్టిలో ఇప్పుడు తన పెద్ద బిడ్డడే ఏకైక సంతానం.

పిల్లవాడు పోయాడని వినగానే తన కంపెనీ కార్మికులు, పొరుగువాళ్లూ చాలా మంది వచ్చారు. పరామర్శచేసి అతనిలో మానుపట్టుతున్న గాయాన్ని రేపటానికి ప్రయత్నించారు గాని సుబ్బారావులో సంచలనం కలుగలేదు.

రాత్రి ఏడు అవుతోందనగా అన్నమ్మ వచ్చింది. చూడగానే గుర్తుపట్టలేకపోయాడు. మెదడులో ఆనవాలు పట్ట

గలిగాడు. అంతరాత్మలో ఎవరో "వచ్చినది అన్నమ్మ కాదుగద?" అని అడిగినట్లనిపించింది - ఔను. అదేపోలిక - అప్రయత్నంగా - "అన్నమ్మా" అని పిలిచాడు. "ఔ" నన్నట్లు తలవూపింది. ఔను అన్నమ్మే వచ్చింది. తనకోసం వచ్చింది. ఏవో పాతవిషయాలు జ్ఞప్తికి వచ్చాయి. అదొక తీపి బాధ ననుభవించాడు. ఈ అన్నమ్మ ఎవరు? తనెవరు? తనకోసం ఎందుకు వచ్చింది? ముఖాముఖి ఏనాడూ మాట్లాడి ఎరుగడే! తన భార్య వున్నన్నాళ్ళూ వస్తూ పోతూ వుండేదేగాని ఏనాడూ పలకరించి ఎరుగడే! అతనికి వింతగా వుంది.

"ఏం అన్నమ్మా నన్ను చూచిపోవటానికి వచ్చావా?"

"పిల్లవాడు పోయాడుటగా" అంది కళ్లు అద్దుకుంటూ.

"ఔను! వెళ్ళిపోయాడు. వాడి ఋణం తీరిపోయింది. ఇంతకూ దానికి మహాపచారం చేశాను. ప్రేమఫలంగా యిచ్చిన ఇద్దరి బిడ్డల్లోనూ - అప్పుడే ఒకడ్ని దక్కించుకోలేక పోయాను. ఖర్మం అనుభవించి తీరాలిగా, అన్నమ్మా?"

"బంగారంలాంటి పిల్లాడు. చారెడేసి కళ్లు. మరీ అక్కకు జబ్బుచేసిన రోజుల్లో పిన్నీ పిన్నీ అంటూ నా కొంగు పట్టుకు తిరిగేవాడు"...... అనుకుంటూ పిల్లవాని హావభావచేష్టలను వర్ణిస్తూ దుఃఖించింది. పిల్లవాడు చేసిన ప్రతి చిన్నవిషయం ఎంత మెళుకువుగా వర్ణించిందో! - వింటుంటే సుబ్బారావు ఆశ్చర్యపోయాడు.

అన్నమ్మ రావటం, తిరిగి పిల్లవాడ్ని వర్ణించి జ్ఞప్తిచెయ్యటం - అతని గుండెను కలచివేసింది. "అన్నమ్మా! దానికి తెలుసు - నేను వట్టి పనికిమాలినవాడ్ని అని - పెద్దవాడెలాగో ఎదిగిపోయాడు. చంటివాడ్ని పెంచి పెద్ద చెయ్యలేనని తెలుసు - అందుకే తనవద్దకు తీసుకుపోయింది చంటివాడ్ని" అన్నాడు.

అప్పటికి రాత్రి తొమ్మిది అవస్తోంది. వాళ్లిద్దరూ మాట్లాడింది ఆట్టే లేకపోయినా మధ్య మధ్య అంతరాయాలతో అంతవరకూ పిల్లవాడ్ని గురించి మాట్లాడాడు. ఇవ్వాళ అన్నమ్మతో మాట్లాడిన తర్వాత సుబ్బారావుకు ఏదో పెద్ద బరువు గుండెలోంచి దింపినట్లయింది.

"ఇంకా వున్నావేం అన్నమ్మా! చాలా పొద్దుపోయింది. ఇక యింటికి వెళ్లు" అని హెచ్చరించాడు సుబ్బారావు.

"ఇంకెక్కడికి వెళ్లను? నాకీ లోకంలో ఎవరు వున్నారు?"

"అదేమిటి అన్నమ్మా అలా అంటున్నావ్!"

"ఇంట్లో మా పిన్ని పోరు ఎక్కువైంది.. మీకు తెలియని దేముంది?......మా నాన్న కొట్టటం గూడా సాగించాడు. నా వున్న స్నేహితురాలు కాస్తా ఈ లోకంలోంచే వెళ్లిపోయిందిగదా! మీరు ఆస్పత్రిలో వున్నారంటే ఒక్కసారి చూడాలని ఎంతో యిదయ్యాను. రెండు మూడుసార్లు బైల్దేరటానికి ప్రయత్నించాను గాని వీలులేకపోయింది. మొన్న పిల్లవాడు పోయినట్లు తెలియగానే ఇక వుండలేకపోయాను. నా మతి మతిలో లేదు. ఏమైనా చూచివస్తానని పట్టు పట్టాను. నా పట్టుదలకు ఫలితంగా దెబ్బలు తిన్నాను. "మళ్లీ నా యింట్లో కాలు పెట్టావా ఒళ్లు చీరుస్తానని" తరిమేశాడు మా నాన్న. ఇదీ నా స్థితి అని తల వంచుకుంది.

సుబ్బారావుది అతిసున్నిత ప్రవృత్తి. తనకోసం త్యాగంచేసిన వ్యక్తి తన ఎదురుగా వుంది. తన ఆంతరంగిక మనోభావాలలో భాగంపంచుకోగల వ్యక్తి తన ఎదుట నిలచింది. తనగురించి తన పిల్లవాని గురించి, తండ్రిని, వాడకట్టును లెఖ్ఖచెయ్యకుండా...తనను నమ్మి...ముందు వెనక లాలోచించకుండా...తనవద్దకు చేరింది. ఈ పరిస్థితుల్లో తన కర్తవ్యం ఏమిటి? ఆమెను పాలించటం తన ధర్మమా? లేక నీతి చెప్పి ఇంటికి మరల్చటం భావ్యమా? ఒక వేళ పాలించినా తను ఈమెతో ఏరీతిగా వ్యవహరించాలి? తను ఏవిధంగా అనుకున్నా లోకం వూరుకోదు. లోకం తనను వెలివేస్తుంది. అంతవరకూ నిజం!...పోనీ పాలించినా... అన్నమ్మ స్త్రీ! స్త్రీప్రవృత్తి చంచలం. ఏనాటికి ఏం కలుగుతుందో! కొన్నాళ్లు సాకినట్లే సాకి తనను నట్టేటముంచి పోతుందేమో? తను ఇంతవరకూ ఏదో ఒక దినచర్యకు అలవాటుపడ్డాడు. అదే సాగిపోతే పోతుందేమో?...ఇలాగే పరిపరి విధాల పరుగులెత్తింది మనస్సు. ఏదీ నిర్ణయించుకోలేకుండా వున్నాడు. అన్నమ్మమనస్సు మరల్చటానికి ప్రయత్నించాడుగాని లాభంలేకపోయింది. ఆనాటినుండి, తను విడుదలఅయ్యేవరకూ అక్కడే వుంటూ వచ్చింది. ప్రక్కన హోటలులో భోజనం చేసేది. తన వద్దనే రాత్రిళ్లు చాప వేసుకు పడుకునేది.

ఆనాడు విడుదల అయినాడు. రాములు పిల్లవాడ్ని తీసుకు వచ్చాడు. బండీ మాట్లాడారు. కాని రాములు ఉత్సాహంగా లేడు. "అయితే-సుబ్బారావ్! అన్నమ్మగూడా వస్తోందా నీతో?" అని అడిగాడు. ఆ ప్రశ్నకు ఏం సమాధానం చెప్తాడో సుబ్బారావు అని అన్నమ్మ అతని వంక జాలిగా-ఆత్రంగా చూచింది. "అవును వస్తోంది" అన్నాడు సూటిగా.

"అసలే ఆసరా తక్కువవాడవు. అన్నమ్మని తెచ్చి కొంపలో పెట్టుకుంటే నీకు గూడెంలో పరపతి పోతుందని తెలుసా" అని మళ్లీ రెట్టించాడు రాములు.

"ఆఁ! అన్నింటికి సిద్ధంగానే వున్నానని" సమాధానం చెప్పాడు సుబ్బారావు. అంతవరకూ బిగపట్టిన శ్వాసను ఒక్కసారి నిబ్బరంతో వదిలింది అన్నమ్మ.

* * *

మర్నాడు ప్రొద్దున డ్యూటీలో చేరాడు సుబ్బారావు. దేముడి దయవల్ల మళ్లీ మాలో మనిషి వి అయ్యావని అందరూ అభినందించారు సుబ్బారావుని. ఆ రోజు పని పూర్తవగానే కంపెనీ మేనేజరుని కలుసుకున్నాడు. కంపెనీలో పని చేస్తుండగా జరిగినది గనుక......ఈ పది హేనురోజులకూ జీతమిమ్మని కోరాడు. నీఅజాగ్రత్తవల్ల జరిగినదానికి మేమెట్లా బాధ్యులం-ఇవ్వాల్సిన అవసరం లేదని అన్నారు కంపెనీఅధికారులు. దాంతో చాలా యిబ్బందిపడిపోయాడు. అసలు తను ఆస్పత్రిలో జేరినప్పటికి పూర్వంవున్న వాతావరణానికి యిప్పటి వాతావరణానికీ చాలా తేడా కనపడింది. మేనేజిమెంటుకు తనకూ అదివరకటినుంచి అంతంతమాత్రమే అని తెలుసు. ఈ లోప

(20-వ పేజీ చూడండి)

# నిక్షేపరాయుళ్లు

"శేఖరంగారున్నారా" అంటూ ఎవరో బయటనుంచీ పిలవటం నేను విన్నాను. నేను డాక్టరు శేఖరం గారింటికి వెళ్ళాను, మా అబ్బాయికి అయిదారు రోజులనుంచీ జ్వరం తగుల్తూ ఉండటంచేత డాక్టరును ఇంటికి పిలుచుకొని వెళ్దామని. కాని ఆయన అప్పుడే ఏదో సీరియస్ కేసు చూడటానికి బయటికి వెళ్లాడట. ఇంక తప్పేదిలేక ఆయన రాకకోసం నిరీక్షిస్తూ, డాక్టరు కన్సల్టింగురూములో కూర్చొని ఆయనకోసం ఎదురుచూస్తున్నాను.

కన్సల్టింగు రూములోనుంచి చూస్తే వీధిలోనివాళ్లు కనిపిస్తారు. డాక్టరుగారిని పిలుస్తున్న దెవరా అని నేను చూశాను. ఎదురుగా కనపడ్డాడు రామగోపాలం.

"డాక్టరుగారున్నారా?" అని తిరిగి కేక వేశాడు రామగోపాలం వీధిలోనుంచి.

డాక్టరు కాంపౌండరు, "డాక్టరుగారిప్పుడే బయటికి వెళ్ళారు. మీ రొస్తే కూర్చోమని చెప్పారు," అని చెప్పాడు బయటికివచ్చి రామగోపాలంతో.

రామగోపాలం లోపలికి వచ్చి, డాక్టరు టేబిలుకు ఎదురుగాఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

రామగోపాలాన్నిగురించి నా స్నేహితుల ద్వారా ఇదివరకు విన్నాను. అతను అఖండ ప్రజ్ఞావంతుడుట. ఆయన తలమీద ఎన్ని వెంట్రుకలున్నయ్యో అన్ని ఆలోచనలుంటయిట ఆయన బుర్రలో. మనిషిని చూడగానే కనిపెడ్తాడు, ఆ మనిషి తెలివితేటలు. ఎదుటివాళ్లను గురించి అతను చెప్పేది అక్షరాలా నిజం కావలసిందేనట. అతనికి తెలియని విషయమంటూ లేదు. అక్కరలేని విషయం అసలేలేదు. అందరికి అయాచిత సలహాలిస్తాడు. ఆ సలహాలను ఆయన యెదుటనే ఎవరన్నా హేళన చేశారా, వాడి పుచ్చ మాపేదన్న మాటే. ఆయన కసలే ఉద్యోగం లేదు. అందరి ఉద్యోగాలూ అతనివే. కాబట్టి అందరూ అతనికి భాగం ఇవ్వాల్సిందే. అతని సంసారం నిలబడటానికి, యెన్ని సంసారాలు కూల్చటానికయినా అతను సిద్ధమేనట. ఒకసారి మనలను పట్టాడో, మళ్లీ వదిలించుకోటానికి తాతలు దిగిరావలసిందే.

అటువంటి మహత్తుగల రామగోపాలం ఎదుట కూర్చొన్న ఏ వ్యక్తి వణకడు? నేనూ కొంచెం ఉన్నవాళ్లక్రిందే జమ. కాని నేను మాత్రం సామాన్యుడినా? ఇటువంటి పెద్ద బుర్రలను దగ్గిరికి రానీయకుండా వేయికళ్ళతో నా చుట్టూ చూసుకొంటాను.

ఎదుటిగా కూర్చొంటే మనలను సంభాషణలోకి దింపుతాడేమో నని, డాక్టరుకోసం తిరిగి రావచ్చు. ఇప్పుడింటికి వెళ్దాము, అని లేవబోయాను. కాని రామగోపాలం, అతను లోపలికి అడుగుపెట్టినప్పటినుంచీ నన్ను, గమనిస్తూనే ఉన్నాడు. నా వేషాన్ని చూసి, ఫరవాలేదు, పిట్ట దొరికింది, అని అనుకొని ఉంటాడు. నేను లేవబోయేసరికి నన్ను చూసి "ఏమండీ,మీరు డాక్టరుగారికోసమే గద వచ్చింది?" అని పలకరించాడు.

"అవునండీ" అన్నాను నేను.

"మరి వారు రాకుండానే పోతారే? కూర్చోండి. వారిప్పుడే వస్తారు? పది నిమిషాలలో వారు రానే వస్తారు. ఇంతలో మీరు తిరిగి వెళ్ళటం దేనికి?"

"ఆఁ. వారు ఇంకా ఎంతసేపటికి వస్తారో. మళ్ళీ వస్తానండీ"

"ఏమిటండీ? పది నిమిషాలలో యేం మునుగుతుందండీ? పిచ్చాపాటీ మాట్లాడుకొందాము కూర్చోండి?" అన్నాడు రామగోపాలం.

విధిలేక నేను మళ్ళీ బెంచీమీద చతికిలబడ్డాను.

"అయితే. తమరి నామధేయం?" అన్నాడు రామగోపాలం.

అతి వినయం ధూర్తలక్షణం అని నాకు జ్ఞాపకం ఉంది.

"రామారావు" అన్నాను.

"తమరింట్లో ఎవరికి మందు?"

"మా అబ్బాయికేనండీ. అయిదారు రోజులనుంచీ జ్వరం తగులుతున్నది. మగతగా ఉంటున్నాడు. రెండు మూడు రోజులు, పోతుందిలే అని ఉపేక్షించాము. కాని ఇంతవరకేమీ తగ్గలేదు హెచ్చుటకే తప్ప. అందుకని మన డాక్టరుగారిని తీసుకునివెళ్లి చూపిద్దాము అని ఇలా వచ్చాను."

"డాక్టరుగారు వచ్చే వేళయింది లెండి. మనమంతా కలిసి వెళ్దాము. నేను కూడా చెప్తాలెండి డాక్టరుగారికి కేసు శ్రద్ధగా చూడమని"

వీడి దుంపతెగ! వీడి రికమెండేషను ఎవరిక్కావాలి? ఫీజు యిస్తే డాక్టరుగారు చూడడూ? మధ్య వీడి రికమెండేషనేమిటి? నాకేదో పెద్ద సహాయం చేసేవాడిలాగ పోజు పెడ్తాడేమిటి?

"శ్రీరాగి"

డాక్టరుగా రొచ్చేటప్పటికి ఇంకో అర గంట పట్టింది. ఈ అరగంటలో రామ గోపాలం ఏదో వాగుతూనే ఉన్నాడు. నన్ను బాగా పరిచయం చేసుకొన్నాడు.

డాక్టరు శేఖరం అల్లోపతీవైద్యుడు కాదు. హోమియోపతి డాక్టరు. వైద్యంలో మంచి పేరు సంపాయించాడు. వాస్తవానికి ఉన్నదని వినికిడి. చాలా గడ్డుకేసులు అతని చేతిలో గట్టెక్కినయి. ఫీజు ఇస్తేనే రోగిని చూస్తాననే రకం కాదు. ఆ ఫీజు కూడా రోగుల తాహతనుబట్టే తీసుకొంటాడుగాని అత్యాశలకు పోడు. అందుకనే అతను రోగుల నెక్కువగా ఆకర్షించగలిగాడు. శేఖరం మర్మంలేని మనిషి. మనిషిని నమ్మాడా, ప్రాణమిస్తాడు. ఎదుటివాళ్ల మనస్సు లెటువంటివో కనిపెట్టే సత్తా ఉందిగాని, ఎలా నమ్మాడో రామగోపాలాన్ని నమ్మాడు. ఇంక ఓ పట్టాన వదిలి పెట్టాడా రామగోపాలం ఆ డాక్టరును. రోజూ వచ్చే సంపాదన స్నేహితుల కాఫీ సిగరెట్లకు సరిపోతున్నది. కాఫీకి వెళ్లితే, రామగోపాలం, అతనితో సహా పదిపదిహేను మంది స్నేహితులు లేవాల్సిందే. సినిమాకు వెళ్లితే అధమం పదిరూపాయలనోటు ఖర్చవాల్సిందే.

డాక్టరు శేఖరం రాగానే నేను లేచి నమస్కరించాను. కేసు వివరం ఆయనకు చెప్పాను.

డాక్టరు, రామగోపాలం, నేను జట్కాలో మా యింటికి చేరుకొన్నాము. డాక్టరు పిల్లవాడిని పరీక్షచేసి, ఇన్‌ప్లుయిన్జా జ్వరమయి ఉంటుందని చెప్పాడు.

"మరేం ప్రమాదం లేదుగదండీ, డాక్టరుగారూ" అని నేను ఆదుర్దాతో ప్రశ్నించాను.

"ఏం భయంలేదండీ, మామూలు ఇన్ప్లుయిన్జా జ్వరమే. కాని మీరు పిల్లవాడు అటు ఇటు తిరగకుండా జాగ్రత్త తీసుకోవాలి. కదుత్తే రోగం ఎక్కువవుతుంది. ఈ పొట్లంలో మూడుడోసులు మందుంది. ఇప్పుడొక డోసువేసి, తరువాత రెండు గంటల కొక డోసు చొప్పున వెయ్యండి. పాలు, బార్లీ తప్ప ఇంక యేమీ ఇయ్యవద్దు. ఆహారం ఎంత తేలికగా ఉంటే అంత మంచిది."

డాక్టరు, రామగోపాలంతో కలిసి వెళ్లిపోయి నాడు. పక్షంరోజులు గడిచినయి. పిల్లవాడి జ్వరము ఒకవారం రోజులలో తగ్గుముఖం చూపి, తిరిగి తీవ్రతచూపించింది. ఈ పక్షంరోజులలోను రామగోపాలం డాక్టరుతోపాటే కాకుండా వీలైనప్పుడల్లా, మా యింటికి వస్తూ ఉండేవాడు.

జ్వరంవిషయంలో ఆ సలహా, ఈ సలహా చెపుతూ ఉండేవాడు. నా క్షేమంకోసమే నా యింటికి వచ్చినట్లు ప్రవర్తించేవాడు. ఎట్లా లేదన్నా, రోజుకు రెండుమూడుసార్లాయనకు కాఫీపోయించక తప్పేదికాదు. అతనికి జాతకం చూడటం కూడా వచ్చుట ఖర్మం. వాడి చక్రము వేసుంటే ఇయ్యి, చూసి చెప్తాను, ఈ జ్వర మేమిటో, ఎందుకు వచ్చిందో నంటాడు.

ఇప్పటికి పిల్లవాడికి జ్వరం మొదలు పెట్టి ఇరవై రోజులయింది. చివరికి డాక్టరు టైఫాయిడ్ అన్నాడు. రామగోపాలం నన్ను రోజూ పీడిస్తున్నాడు పిల్లవాడి జాతకచక్రం ఇయ్యమని. నేను అలాగే పెట్టుకొస్తున్నాను.

ఆనాడు జ్వరం మొదలుపెట్టి ఇరవై ఒకటోరోజు. జ్వరతీవ్రత బాగాఉంది. అంతా ఆందోళన పట్టున్నాము. ఆరోజున రామగోపాలం, పిల్లవాడి జాతకచక్రం ఇచ్చేదాకా వదిలిపెట్టలేదు.

సరే యెలాగయితే నేం అతనికి చూపించాను. అతను రెండుగంటలసేపు లెక్కలు వేసి తేల్చి చెప్పిన విషయం.

"పిల్లవాడికి మంచిగండం ఉంది. కాని తగినశాంతి చేస్తే బయటపడే సూచనలున్నాయి."



అనగానే గుండెల్లో రాయిపడ్డట్లయింది. వీలుగా ఉంటే శాంతి చేయించి మనపిల్లవాడిని ఎందుకు బ్రతికించుకోకూడ దనిపించింది, ఆ ఆదుర్దాలో, అదివరకు ఈజాతకాలమీద యే నమ్మకం లేకపోయినా.

"ఆశాంతి ఏదో; ఎలా చెయ్యాలో, మీకు తెలుసుగదా చెప్పండి" అని అన్నాను.

రామగోపాలం ఇలా అన్నాడు.

"నవగ్రహ శాంతి చేయించాలి, రోజూ తొమ్మిదిమంది బ్రాహ్మలనూ పెట్టి, నవగ్రహాలకు యిరవై ఒక్కరోజులూ జపం చేయించాలి. రోజూ ఈ తొమ్మిదిమంది బ్రాహ్మలకూ భోజనం పెట్టాలి. యిరవై ఒక్కరోజూ పూర్తి అయినతర్వాత మీ ఓపికకొద్దీ, రెండువందలమందికో మూడు వందలమందికో సమారాధన చేయించాలి. ఈ ప్రకారం మీరు శాంతిచేయిస్తే, మీ పిల్లవాడు గండంగడచి బైటపడ్డట్లే. తరువాత మీ యిష్టం. మీ శ్రేయస్సు కోరేవాణ్ణి కనుక చెప్తున్నాను, ఈ శాంతి జరిపించడం సర్వవిధాలా ఉత్తమమని"

నాలో నేను అంచనా వేసుకొన్నాను. తొమ్మిదిమంది బ్రాహ్మలకూ రోజుకు ఒకొక్కరికి మూడురూపాయల చొప్పున ఆరువందలరూపాయలు, భోజనంతో సహా అవుతుంది. తరువాత యిరవై రెండో రోజున చేసే సమారాధనకు యెంతలేదన్నా రెండుమూడువందలు ఖర్చు పెట్టాలి. ఇదేదో మనల్ని ముంచుదామని వేసినఎత్తేరా బాబూ అనుకొన్నాను. పిల్లవాడిజ్వరం నయం కావటానికి దేవుడిమీదనే భారంవేసి ఆయనతో ఇలా అన్నాను.



"నాకీ శాంతులు, జాతకాలమీద యేమీ నమ్మకం లేదండి. ఏదో మీరు చూపించమంటే జాతకం చూపించాను గాని నాకు నమ్మకముండిగాదు. జ్వరం నయం కావటానికి మన డాక్టరుగారిమీదే భారం వేశాను. ముంచినా తేల్చినా వారే. ఈ విషయంలో మీరు నన్ను క్షమించాల్సిందే" అని అన్నాను.

దాంతో రామగోపాలం మొఖం నల్లబడిపోయింది తనంతటివాడు సలహా చెప్తే పాటించటంలేదని. కాని చేసేదిలేక అంతటితో ఆ ప్రమేయం ఆపేశాడు.

తర్వాతరోజునుంచి పిల్లవాడికి జ్వరం క్రమేణా తగ్గుముఖం పట్టింది. దేవుడి దయవల్ల కానీయండి, డాక్టరుగారి ప్రభావంవలన కానీయండి. అయిదారు రోజులలో డాక్టరుగారు పత్యంకూడా పెట్టించారు. ఆ పత్యం పెట్టినరోజునుంచీ డాక్టరుగారు మా యింటికి రావటం మానేశారు. పిల్లవాడు క్రమంగా కోలుకునేదాకా వచ్చి చూసిపోవల్సిన డాక్టరు రాకపోవటంవల్ల అప్పుడే నాకేదో అనుమానం వేసింది రామగోపాలం డాక్టరుకేదో నామీద చెప్పి ఉంటాడని. అవును, తన సలహా విని నేను చెడిపోలేదని అంటే డబ్బు నీళ్ళలాగా ఖర్చుపెట్టలేదని, రామగోపాలానికి నేనంటే ద్వేషమూ, కోపమూను. డాక్టరుకు ఫీజు విషయంలో నేను లోపంచేయలేదు. అతనిలో ఏదో దురభిప్రాయం కలుగచేయడంవల్లనే, డాక్టరు రోగి పూర్తి ఆరోగ్యం పొందకుండానే, రోగివిషయం శ్రద్ధ తీసుకోలేదు. కాని భగవంతుడి దయవల్ల నా పిల్లవాడు ఆ దెబ్బనుంచి పూర్తిగా బయటపడ్డాడు.

రామగోపాలంవంటి మనుష్యులు లోకంలో ఎంతమంది ఉన్నారో? పాపం ఇప్పటికే డాక్టరు కొంప మూడు వంతులు కూల్చాడు తన కాఫీ సిగరెట్లతో. నూరు అబద్ధాలయినా సరే చెప్పి ఒక కొంప నిలపమన్నారు. అలాగే మన రామగోపాలం నూరు కొంపలు కూల్చి తన కొంప నిలబెట్టుకుంటున్నాడు. 

# ఏవేటి పిచ్చి?

"ఏయ్! ప్రసాద్!"

"ఓ, నువ్వా, రామూ, ఏం కనపడటంలేదే? శలవుల్లో వూళ్ళో లేవా యేం?"

"మా మేనమామగారి వూరు వెళ్ళానులే. రెండు రోజులైంది వచ్చి. నీ దర్శనం కోసమే ఎదురుచూస్తున్నా".

"ఏం? యేమిటి విశేషం?"

"పార్కుకు పద. చెప్పుకొందాము".

*   *   *   *

"నే వెళ్ళినవూరు యేమంత పెద్దదీకాదు. చిన్నదీ కాదు. ఇప్పుడిప్పుడే బస్తీగా మారబోతున్న పల్లెటూరు. నీకు తెలుసుగా మామ ఆ వూరు కరణం. పిత్రార్జితం వుంది కాబట్టి, ఆ కరణీకం చూచుకుంటూ కాలుమీద కాలు వేసుకొని వచ్చేపోయేవార్ని విమర్శించేందుకు తగిన అవకాశాన్ని వెతుక్కుంటూ వుంటాడు. ఆ వూళ్లో పెద్దలనిపించుకు నేవాళ్ళందరూ రోజూ ఆయనింటికి జేరి బాతాఖానీ వేసుకుంటూ వుంటారు.

నే వెళ్లిన మర్నాడు వాళ్లు అందరూ చేరి ఈ కబుర్లూ, ఆ కబుర్లూ 'చెప్పుకుంటూ వుంటే ఒక చేత్తో గొడుగూ, మరొక చేత్తో ఏదో పుస్తకాలకట్టా తీసుకొని ఒకాయన వచ్చాడు. ఆయన రావటం రావటం మా మామయ్యతో

'నమస్కారమండీ. మీతో పనుండి వచ్చాను.'

'ఎవరూ? గోపాలంగారా! అబ్బో ఇదేమిటండోయ్. ఇటు దయచేశారు'

'మీతో పనుండి వచ్చానండీ......ఆర్థికంగా ఇబ్బందుల్లో వున్నవారికి, స్వంత భూమీ, ఇల్లూ లేని వారికి ఏదో అప్పు లిస్తామని కాగితా లొచ్చాయి. ఆ సహాయం పొందదగియున్నట్లు గ్రామాధికారి యోగ్యతాపత్రం కావాలట. కాబట్టి దయచేసి మీరీ సహాయం చేసిపెట్టాలి.

"అబ్బే. ఇటువంటి కాగితా లివ్వటం నా కలవాటు లేదుసుమండీ. ఏమో, నా సంతకాన్ని అడ్డమైనవాళ్ల పనులకీ వుపయోగించటం నా కిష్టంలేదు. నేనీ పనిచేయలేను."

"అదేమిటండీ! సుబ్బయ్యగారూ, మీరే ఇట్లా అంటే ఎట్లా? గ్రామాధికారాన్ని వహిస్తూ ఈ మాత్రం సహాయం చేయటానికే ఈ విధంగా మాట్లాడుతారేమండీ? అయినా అందరికి మల్లే నే నేమీ లేనిపోని పత్రాలు పుట్టించమనలేదే. నా స్థితిగతులన్నీ మీకు తెలుసాయె. అదే కాగితంమీద వ్రాసి స్తే మునిగే దేముందండి. అయినా తమ రెంతమంది కెన్నెన్ని విధాల సహాయం చేయటంలేదు? తలుచుకుంటే నాకుమాత్రం చెయ్యలేరా?"

"అబ్బే, చేయలేనులెండి" అని ఆయన తన వాగ్ధోరిణిలో పడ్డాడు. పాపమా మనిషి యెంత బాధపడ్డాడో! ప్రసాద్! అప్పుడు చూసినవాళ్ళకి మాత్రమే అది తెలుస్తుంది. కాని ఆయన మారు మాట్లాడకుండా వెళ్లిపోయాడు. ఆయన మెట్లు దిగాడో లేదో "వచ్చాడు 'పిచ్చాడు' ఈనాటికి మన చేతుల్లోకి వచ్చాడు" "అయినా ఒక వూళ్ళో వున్న తరువాత ఒకరితో ఒకరికి పనులుంటాయని ముందర తెలియదూ,

**"జారు"**

పిచ్చాడు!" అనే మాటలు ఆ పెద్దల నోళ్ల నుండి రావటం నాకు వినపడ్డాయి. అయినా నా కంతకుపూర్వపు సందర్భాలు తెలియనందున అప్పటికి మాట్లాడ కూరుకున్నాను.

ఆ రాత్రి భోజనాలైనతరువాత మా మామా, నేనూ వాకిట్లో మంచా లేసుకొని పడుకొన్నాము. అదేసమయమని నేను "అయితే, మామా ప్రొద్దునవచ్చింది ఎవరు? ఏమిటి? ఎప్పుడూ, ఎక్కడా లేంది పాపమాయనదగ్గర నీ సంతకాని కంత విలువిచ్చావేమిటి?" అని అడిగాను.

దాంతో మా మామ "వాడా! వాడొక పిచ్చాడు. 'బతకలేక బడిపంతులుద్యోగ్యం" చేస్తున్నా ఏమిటో నిక్కుకుపోతాడు. ఇన్నాళ్ళపట్టి ఎదురులేని మా మాటకీ నాడు ఈ చచ్చువెధవ యెదురు చెపుతున్నాడు. మేం తలుచుకుంటే అతడెంతో ఇక తెలుస్తుందిలే వాడికి" అన్నాడు. "అయితే మామయ్యా! ఆయనకి నిజంగా ఆస్తేమీ లేదా?" అని అడిగాను.

"అబ్బే, ఆస్తి ఏమిటి? ఎవరన్నా తీసుకుంటే తలే తాకట్టుకు ఇచ్చే స్థితిలో నున్నాడు. అయినా 'మింగ మెతుకులు లేవు మీసాలకు సంపెంగనూనె లంటారు' ఈ బాపతు నే. ఈపూట కుంటే మాపిటికుండదు. ఏమిటి? ఆదర్శాలట! ఆదర్శాలు. ఊరిలోని పెద్దలము అంతా ఒకదారిని పోతే తానింకో దారిని పోతాడు. నెమ్మది నెమ్మదిగా చూస్తాడుగా ఫలితము" అన్నాడు. దాంతో కుతూహలం మరీ ఎక్కువై అసలు విషయం చెప్పమన్నా.

"ఆ పిచ్చాడు ఇక్కడికొచ్చి రెండేళ్లు అవుతుంది. ఈయన వచ్చి నేడే స్కూల్లో హెడ్‌మాస్టరు మామూలుగానే శెక్రటరీగారబ్బాయినీ వాళ్లనీ (తప్పినా) ప్యాసుచేయబోతే వీలులేదంటే వీలులేదని, పెద్ద హంగమాచేసి ఆపుచేయించాడు. తరువాత నాతోకూడా ఒకటి రెండుసార్లు మొరటుగా ప్రవర్తించాడు. నేనేమో చెయ్యరాని పనులు చేస్తున్నానట. లేనిపోని యోగ్యత నాపాదించి యోగ్యతాపత్రా లిస్తున్నానట. అయినా ఒరే, నువ్వే చెప్పు నేను కరణాన్నయ్యుండి శెక్రటరీగారమ్మాయికి స్కాలర్‌షిప్పు కోసం పద్ధనిమి

దేళ్లంటే పదహారేళ్ళని వేయటం కూడా పెద్ద తప్పేనా? ఈ వెధవ అది తగదని నాకు చెప్పొచ్చాడు. తరువా తొకసారి నలుగురి పెద్దమనుష్యుల్లో ఏదో రిక్షావాణ్ణి కొట్టా నని-నాతో సూటిగా 'నీదే తప్పు. ఇంకెప్పుడూ తొందరపడబోకండి' అంటాడు? పిల్లొచ్చి గుడ్డును వెక్కిరించిందట. అని ఇంకా ఏవేవో చాలా చెప్పాడు. చివరికి ఎందులో చూచినా నాకు పాపం మా ఉపాధ్యాయుని తప్పేమీ కనపడటం లేదు. న్యాయంగా వుండా లంటాడులాగుంది. అంతే చివరికి ఆవూరి పెద్దలనబడేవాళ్ళంతా ఆయనమీద కత్తికట్టి రోడ్డుమీద నుండి వెడుతుంటే "పిచ్చాడు" అని అని పించీ అనేకవిధాలుగా గోలచేశారట.

ఆయన మాత్రము తనతో యెవరైనా ఈ విషయాలు ప్రస్తావిస్తే "ఆ, ఏదో, పిచ్చాళ్లు ఇప్పుడేదో ఈ విధంగా ప్రవర్తించి బావుకుందా మనుకుంటున్నారు గాని, నిజంగా అదే వారి పతనానికి దారితీస్తుందని తెలియదు, పిచ్చివాళ్లు" అంటాడు.

'ఇప్పుడు నాకొక అనుమాన మొచ్చింది అతన్ని కాదన్న ఆ వూరివాళ్లది పిచ్చా? వాళ్లని కాదన్న అతనిది పిచ్చా?' అని నేనంటే

"వాళ్ళ విషయం అటుంచి ముందు నీది పిచ్చి. విషయం అరటిపండు వొలిచి పెట్టినట్లుగా వుంటే ఇంకా అడుగుతావేమిటి? న్యాయంకోసం పోట్లాడేవాడ్ని పిచ్చివాడ్నిగా జమకట్టటం లోకానికి కొత్తా" అన్న ప్రసాద్ మాటలు నాకు నిజమే ననిపించాయి.

---

## ఉద్యోగి

(11-వ పేజీ తరువాయి)

సర్దుతుంటే శాంతకు మూర్తి పెట్టెలో ఉద్యోగానికి మూర్తి పెట్టుకున్న రాజీనామా కాగితం కన్పించింది. రాజీనామా? కారణం?

భర్తరాకకై ఆనాడు ఎదురుచూసీచూసీ కండ్లు చిల్లులు పడ్డాయి శాంతకు. భర్త వచ్చీరావడంతోటే తన సంశయాలను గురించి ప్రశ్నల వర్షం కురిపించింది.

శాంత వెళ్ళిన రోజుకు రెండు రోజులకు పూర్వం సుబ్బయ్యవద్ద లంచం పుచ్చుకుని శాంత కోరికలను మూర్తి తీర్చినట్లు, సుబ్బయ్య పని పూర్తయిన తరువాత మూర్తి లంచగొండిఅని ప్రచారం మొదలు పెట్టినట్లు, చివరకు ఆ జిల్లానుండి శాసన సభకు జరిగిన బై ఎలక్షన్ సందర్భంలో ఏర్పరుపబడిన బహిరంగ సభలో ఆఫీసర్ల లంచగొండితనం గూర్చి మాట్లాడుతూ సుబ్బయ్య తన్ని గనుక శాసనసభకు పంపిస్తే లంచగొండి ఉద్యోగులను బర్తరఫ్ చేయిస్తానని, ముందుగా మూర్తిని చేయిస్తానని సవాల్ చేసినట్లు, మూర్తి సుబ్బయ్యకు ప్రజల్లోను, మంత్రుల్లోనుగల పలుకుబడినిచూసి భయపడి సుబ్బయ్య గెలిస్తే రాజీనామా ఇవ్వటానికి నిర్ణయించుకొన్నట్లూ, నిర్ణయించుకోవడమే కాకుండా రాజీనామా ప్రతిని తయారుచేసి యుంచినట్లూ, కాని సుబ్బయ్య గెలవకపోగా డిపాజిట్ కూడా కోల్పోయినందుకు తన రాజీనామాను దాఖలు చేయనట్లు నీతిపరుడై ఋజుమార్గాన నడుస్తున్న తన్ని గురించి సుబ్బయ్య ఆ జిల్లాలో ప్రచారం చెయ్యడంవల్ల మరో జిల్లాకు బదిలీకి ప్రయత్నిస్తున్నట్లు మూర్తి శాంతకు తెలియపరచాడు.

ధైర్యం చెయ్య లేనివాడు ఒక్క సారి ధైర్యం చేసినందుకూ, దానికే కొండంత నిందను సంపాదించు కొన్నందుకు మూర్తి హృదయ భారంతో తలవంచాడు. మూర్తి ఆవేదన, బాధ, అపఖ్యాతికి కారకురాలై నందుకు శాంత తల కూడా ఒంగిపోయింది.



# తరంలో అంతరం

(14-వ పేజీ తరువాయి)

లనే-అదను చూసుకుని తనంటే పడనివాళ్లు తనమీద ఏవేవో చెప్పివుండచ్చు. పనివాళ్లు సరిగా మాటవింటంలేదు. ఏదో విసిగిస్తే, ఒక పనివాడ్ని కేకలేశాడు. అది పైదాకా పోయింది. తన క్రింద వాళ్లను అదుపులో పెట్టుకోవటం మేస్త్రీయొక్క కనీసధర్మం. దానిని అతను నిర్వర్తించాడు. అయినప్పటికీ మాట దక్కలేదు. ఆ విషయమై అతనిని సంజాయిషీ అడిగారు. వస్తుతః అభిమానంగల వ్యక్తేమో కొంచం చిరాకుపడ్డాడు. గట్టిగానే సమాధానం చెప్పాడు. మేనేజరు మొహంచూస్తే మర్నాటికి తన ఉద్యోగం వుంటుందో వూడుతుందో అనుమానంగా వుంది.

అలిసిపోయి యింటికి వచ్చాడు. అతని మతి మతిలో లేదు. అన్నమ్మ పిల్లవాడికి అన్నం పెడ్తోంది. ఉడుకునీళ్లు కాచి సిద్ధంగా వుంచింది. స్నానంచేస్తుంటే, అన్నమ్మ మొదలు పెట్టింది. "నేను చెడిన దాన్ని కాకుండా మిమ్మల్ని గూడా చెడకొడుతున్నాను. ప్రతిరోజూ-ఆడా మగా-ఇటు పోయేవారంతా ఒకటే ఆడిపోసుకుంటున్నారు మనిద్దర్ని గురించీ" అని జాలిగా అన్నది...ఈ మాటలు వినేసరికి మరింత విసిగెత్తిపోయినాడు. కంపెనీ మీద-తన మేస్త్రీతనంమీద.- అన్నదమ్ముల మీద-ఈ లోకంమీదా-ఆఖరికి తనమీదా విపరీతమైన చిరాకూ కోపం కల్గినాయి... కాని తమాయించుకున్నాడు.

భోంచేస్తూ చెప్పాడు - "ఇక ఇక్కడ. లాభంలేదు అన్నమ్మా. ఇంకెక్కడికైనా వెళ్లిపోదాం - రేపే!" అని.

"అయితే నీ ఉద్యోగమో? " అన్నది అన్నమ్మ.

"ఉద్యోగం ఇక్కడ చెయ్యాలని లేదు. పనితెలిసిన కార్మికుడికి ఇక్కడ కాకపోతే మరెక్కడైనా గడుస్తుంది. నా పనితనం నా సత్తా వాళ్లకి తెలుసు. అయినా వాళ్లకు నేను జోహుకుములు చెయ్యలేదని, మాటిమాటికి దర్శనాలు చెయ్యలేదని, వాళ్లంటే లక్ష్యం చెయ్యనని వాళ్ళకి నామీద తెగులు. పని చేతకాని వాళ్లూ - ఇక్కడ తీసేస్తే మరెక్కడా చిల్లికానీకి చెల్లనివాళ్లూ ఈ దొడ్డిదారిపద్ధతి అవలంబించాలిగాని నాబోటి పనివాడికి వాటితో నిమిత్తంలేదు. ఆ కంపెనీలోంచి మానటం వల్ల నాకు నష్టంలేదు. పొరుగూరుపోతే మరో పదిరూపాయలు ఎక్కువే సంపాదించగలను. కాని ఈ కంపెనీవాళ్లు మాత్రం కొద్దిరోజుల్లోనే ఈ జోహుకుం గాళ్లతో - నెత్తి బొప్పికట్టి పశ్చాత్తాపపడక తప్పదు - సరే యింతకూ అన్నీ కలిసి వచ్చినా - మూటా ముల్లె సర్దు—ఏమైనా సరే- రేపీపాటికి మరో వూళ్ళో వుండాలి."

—అని అన్నాడేగాని - తన జబ్బుకు చాలా ఖర్చు అయి - యిప్పటికే అప్పు చేయవల్సి వస్తోంది. ఇది ఎరుగున్న పొరుగు గనుకే అప్పోసప్పో చేసి నెట్టగల్గుతున్నాడు. పరాయివూరు వెడితే వెంటనే పని దొరుకుతుందని భరోసా ఏదీ? అంతవరకూ తన పొట్టగడవటం ఎలాగ? పైగా తనతో పాటు అన్నమ్మగూడా వున్నదాయను.

—ఈ ఆలోచనలతో అతనిలో వుద్రేకం కొస్తా దిగులుగా మారింది. మనస్సు ఎటో పోయింది. మళ్లీ అతని చేతుల్లో గల్లుమని డబ్బులమూట పడేసరికి ఉలిక్కిపడి ఎదురుగా చూచాడు. అన్నమ్మ నుంచుని వుంది. ఎన్నాళ్ళనించో పోగుచేసివుంచిన డబ్బు యిది. నేను నీ సంసారానికి ఒక గుదిబండగా వుండటం ఎంతమాత్రం యిష్టం లేదు. ఈ డబ్బు ఇవ్వాలని యిదివరకే అనుకున్నాను. కాని ఈనాడు దాంతో నిజమైన అవసరం కల్గింది." అన్నది. "ఎందుకులే వుంచు" అని అనలేకపోయాడు. మరు మాట్లాడకుండా పుచ్చుకున్నాడు. కృతజ్ఞతగా చిరునవ్వు నవ్వాడు సుబ్బారావు. పొరుగూరు చేరాడేగాని అనుకున్నంత తేలిగ్గా స్థిరపడలేకపోయాడు. తను పనివాడన్న సంగతి అక్కడవాళ్లకు తెలివిడి కావాలి. తెలిసి ఒప్పుకున్నా జీతందగ్గర కొంచెం పేచీ వచ్చేది. ఈ రోజుల్లో. అన్నమ్మసమయ మెరిగి ఇచ్చినడబ్బు తనని ఎంతో ఆదుకుంది!

ఇల్లు అద్దెకు తీసుకున్న మరి నాలుగు రోజులకు పని కుదిరింది. ఒక ఫౌండ్రీలో మేస్త్రీగా జేరాడు. ఒళ్లు దాచుకునే వ్యక్తి కాదేమో - త్వరలోనే - పైవాళ్ల అభిమానం చూరగొన్నాడు. కుర్రవాడ్ని దగ్గరనే వున్న కాన్వెంటు స్కూలుకు పంపుతున్నాడు. ఇదివరకటికన్నా జీతం ఎక్కువ. అన్నీ సుఖంగానే గడిచిపోతున్నవి. అన్నమ్మ సుష్టుగా ఇంతకాచిపోస్తున్నది. తనకు వేరే వ్యావృత్తిలేదు. పిల్లవాడు యింటికివచ్చి పాఠాలు శ్రద్ధగా చదువుకుంటుంటే ముచ్చట వేసింది. వాడు ముమ్మూర్తులా తనపోలిక, దానిపేరున నిలిచిన నలుసు. తను ఒళ్లు దాచుకోడు. పట్టుదల, కార్య దీక్ష, కష్టపడటం— ఇవ్వన్నీ చదువుకుంటున్న కొడుకులో ఇలా ప్రతిబింబించినై...చదివి పెద్ద వుద్యోగంచెయ్యాలి...తను పడిన కష్టాలు తనతో తేసరి అవాలి...వాడిమీది ఆశలతో తియ్యటి కలలు కన్నాడు.

* * *

ఆనాడు ఆరుబైట వెన్నెలలో పడుకున్నాడు. దూరంగా పిల్లవాడు దీపం దగ్గర చదువుకుంటున్నాడు. ప్రపంచం చాలావరకూ నిశ్శబ్దమైంది. పని పూర్తిఅయి అన్నమ్మ తనవద్దకు వచ్చింది.

"ఏం అన్నమ్మా పడుకోకుండా యిలా వచ్చావు ?" అని అడిగాడు.

అన్నమ్మ దగ్గరగా జరిగి కూర్చుని—

"నన్ను ఇలాగా ఎన్నాళ్లని వెలివేస్తారు! దూరంగా ఎన్నాళ్లని అట్టేపెడ్తారు! బాహ్య ప్రపంచంలో మనం భార్యాభర్తలంగానే చలామణీ అవుతున్నాము. కాని అది అక్షరాలా పాటింపబడటంలేదు. ఈ విషయం మీకు గుర్తుచేయ్యాలని ఒక్కొక్కప్పుడు తీవ్రమైన ఆందోళన పడేదాన్ని. కాని, మా అక్క, మాఅక్క

మీద మీ ప్రేమ గుర్తుకువచ్చి నన్ను పిరికి దాన్ని చేసేసినవి. ఇవ్వాళ మీ కేవిధంగా ఎరుకపర్చుకోగల్గుతున్నానో నాకే తెలియదు..." అని ముభావంగా పూరుకొంది. నిశ్చలంగా మారుమూలవున్న ఒక సరోవరంలాంటి అతని హృదయంలో ఇది ఒక రాయిపలె పడి విచిత్రంగా స్పందించింది. -ఏదో వచ్చింది. వుంటోంది. అంతే. అతనిలో ఇంతకన్న ఏ విధమైన ఆలోచన, ఇంతవరకూ పొడసూపలేదు. అన్నమ్మ మాటలలో ఎంతమాత్రం అసత్యం లేదు. నిజానికి -నమ్మకుని, యౌవ్వనంలో వున్న స్త్రీ వ్యక్తి వున్నదంటే ఎన్నాళ్లు చలించకుండా వుండగలదు? తాను? సంసారసుఖాన్ని అనుభవించి ప్రస్తుతం మోడుగా మారిన వ్యక్తి! తన ఎదురుగా - అనాదృత అయిన అనాఘ్రాత పుష్పం నిల్చుని ఆహ్వానిస్తోంది......అతనిలోని పురుషత్వం మేలుకుంది. వుద్రేకానురాగాలకు నిలయమైన మానవత్వం తనలో వున్నదని గుర్తించగలిగాడు. అన్నమ్మవంక తిరిగాడు. అతని దృక్పథం మారింది. అతని కళ్లకు అన్నమ్మ సౌందర్యరాశిగా కనపడింది!...ఆమె తలలోని మల్లెలు అతన్ని మత్తెక్కించాయి. ...జడత్వపు సంకెళ్లు త్రెంచుకుని అతని చేతులు ఆమెను దగ్గరకు లాక్కున్నవి! "నన్ను మేల్కొల్పావు అన్నమ్మా! ఇన్నాళ్లుగా నీయడల అపచారం చేశాను. నన్ను క్షమించవూ?" అన్నాడు మరింత దగ్గరకు తీసుకుని. సమాధానంగా...క్షమించానన్నట్లు...బుగ్గమీద మీటింది. సుబ్బారావు ఆశ్చర్యపోయాడు. అన్నమ్మలో ఎంత తేడా? ఈ చలాకీతనం- ఈ సరసం - తన ఎదలో ఏ మూలన దాచుకుంది అన్నమ్మ? పూటభావిలో పూరినట్లు ఈ శృంగార చేష్టలన్నీ అతన్ని ఉక్కిరిబిక్కిరి చేసి ముంచివేస్తున్నవి!

......అంతలోనే సుబ్బారావుకు అనుమానం తగిలింది. తనను చెంపదెబ్బ వేసింది. తనమీద అధికారం చెలాయించింది. ఇంతవరకూ ఒకలెకం. రేపటినుంచీ నూతనయుగం ప్రారంభమవుతుంది. తాను చాలా దూరంగా ఆమెను అట్టిపెడుతూ వచ్చాడు. అందువల్ల ఆమెలో ఏవైనా అధికారవాంఛలూ దురుద్దేశాలూ వుంటే- అవన్నీ మాటుమణిగివున్నాయి. ఇంతవరకూ ఒదిగివున్న అన్నమ్మకు తాను యీనాడు దాసుడైనాడు. రేపట్నించీ ఆమె తనమీద అధికారిణి అవుతుంది! ముందు రాబోయే పరిస్థితులు ఎలా వుంటాయో? ఇలాగే కాలం గడిపితే అన్నమ్మకే పిల్లలు పుట్టుకురావచ్చు! అప్పుడు తన పిల్లలపైవున్న ప్రేమ, వాత్సల్యం ఈ పెద్ద పిల్లవానిపై వుండకపోవచ్చు! అప్పుడు తననీ తన పిల్లవాడ్నీ వేరుచేస్తుందేమో! అప్పటికి తనశక్తి తన మతీ ఎలా వుంటాయో?...

ఇటువంటివి తలపుకు రాగానే కూడదు. వచ్చినయ్యో? మనిషిని నీరసపరుస్తాయి... సుబ్బారావు ఒక్కుమ్మడిగా నిస్సత్తువై పోయినాడు...ఇది ఆలోచిస్తున్నంతసేపు- సుబ్బారావు చిన్న మెదడు అన్నమ్మ కేవో సమాధానాలు ఇస్తూనే వుంది. ఆ సందర్భానికి తగిన కార్యకలాపానికి ఈ ఆలోచనలు ఏమీ లోటు కలిగించలేదు.

*　　*　　*

మర్నాటినుంచీ తను అనుకున్నట్లుగానే అన్నమ్మలో విపరీతమైన చురుకుతనం చూడగలిగాడు. మళ్లీ తనొక సంసారి అయ్యాడు. తను పనిచేస్తున్న ఫాండ్రీలో ఇంకా రాజకీయాలు మొలకెత్తలేదు. ప్రశాంత వాతావరణంలో తను సునాయాసంగా పైకి రాగల్గుతున్నాడు. ఇంట్లో ఇన్నాళ్టి బ్రహ్మచర్యజీవితం లోంచి విముక్తిపొందాడు. పూర్తిగా భోగిఅయ్యాడు. కాని సుబ్బారావు అపోహపడినట్లు అన్నమ్మలో చెడు తలపులు పొడసూపలేదు. ఆ కవళికలు ఏమాత్రంవున్నా ఈ వరలోనే బయటపడి వుండేవి? అన్నమ్మ సౌజన్యం నిజాయితీ గలది. అందువల్లనే ఈ మార్పు కలిగిన తర్వాత తనమీద తన కొడుకుమీద అన్నమ్మ ప్రేమ ద్విగుణీకృతం అయిందే గాని వారిద్దరిమధ్యా వేరుపర్చటానికి ప్రయత్నించలేదు.

చూస్తూవుండగానే గిర్రున తిరిగింది సంవత్సరం. అన్నమ్మకు మొగపిల్లవాడు పుట్టాడు. తనకు చేసేవారు లేరు గనుక ఆస్పత్రిలో పురుడు పోయించాడు. తల్లీ పిల్లవాడూ క్షేమంగా తిరిగివచ్చారు. మాతృమూర్తి అయి మొదటిసారిగా—పసిపాప బోసి నవ్వులలో తన చిరునవ్వులు కలిపి...తన ముంగిట ప్రవేసించింది అన్నమ్మ. ఇంటికి వచ్చిననాడు పండగలాగ జరపాలన్నది అన్నమ్మ. సరే నన్నాడు సుబ్బారావు. తనతోటి కార్మికులను, ఇరుగు పొరుగువాళ్లను పిలిచాడు. విందుచేశాడు. వేడుక బాగా జరిపించాడు. వచ్చినవాళ్లందరకూ తన కుటుంబాన్ని ఎరుక పరిచాడు. చంటివాడ్ని చూసినవాళ్ళంతా "అచ్చు నీపోలికే సుబ్బారావు" అని మెచ్చరించారు. పెద్దపిల్లవాడికీ చంటివాడికీ యీడులో చాలా తేడా కనిపించింది. అక్కడక్కడ, అది అసహజం కాకపోవచ్చుగాని, మొత్తమ్మీద వారికి వింతగానే తోచింది. ఊహాగానా లెందుకు అడగనే అడుగుదాం అంటూ ముందుకువచ్చాడు ముసిలి మేస్త్రీ జోసెఫ్.

"పెద్దవాడికీ చంటివాడికీ యీడులో యింత తేడా వుంది. మాచెల్లెలును సరిగా ఏలకుండా అల్లరి పెట్టావేంటి సుబ్బారావు?" అని నవ్వుతూ అడిగాడు.

సుబ్బారావుకు గూడా నవ్వు వచ్చింది. అన్నమ్మ సిగ్గుతో తలవంచుకు నవ్వుకుంది. అతను సమాధానం చెప్పలేదు. వాళ్లు సమాధానంకోసం ఎదురుచూడలేదు. ★

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

## అలెగ్జాండర్ డ్యూమా

## 54

ఇది జరిగిన కొన్నాళ్ళకి ఒకరోజున ఆల్బర్ట్ శాంప్ ఎలిషీలో వున్న మాంట్ క్రిస్టో ఇంటికి వెళ్లాడు. అతన్ని లూషియన్ డిబ్రే కూడా ఆ రోజున అనుసరించాడు. మాంట్ క్రిస్టో సంగతి తెలుసుకోవాలని హెర్మినా డాంగ్లర్ కుతూహలపడుతున్నందువల్లనే డిబ్రే వస్తున్నాడని ఆల్బర్ట్ గ్రహించాడు.

"అయితే డాంగ్లర్ ఇంటికీ మీ యింటికీ మధ్య తరుచు రాకపోకలు జరుగుతున్నా యన్నమాట" అన్నాడు మాంట్ క్రిస్టో ఆల్బర్ట్‌తో.

"అవునండి. నే నా సంగతి మీకు చెప్పానుకదా."

"అయితే, ఆ వ్యవహారం అనుకూలంగానే కొనసాగుతోం దన్నమాట."

"అనుకూల మేమిటి! దాదాపు స్థిరపడిపోయినట్లే" అన్నాడు డిబ్రే.

"బాగుంది. కాని ఇంత త్వరలో స్థిరపడిపోతుం దనుకోలేదు నేను" అన్నాడు మాంట్ క్రిస్టో.

"అదేముందిలెండి. ఇటువంటి వ్యవహారాలు మనయత్నంతో నిమిత్తం లేకుండా వాటంతటవే తెమిలిపోతాయి. మనం మరిచిపోయినా అవి విడిచిపెట్టవు. తిరిగి జ్ఞాపకం దెచ్చుకునే సరికి ఇంత త్వరలో తెమిలిపోయిందేమా అని ఆశ్చర్యపడతాం. మా తండ్రిగారూ బారన్ డాంగ్లర్ కలిసి స్పెయిన్‌లో కొంతకాలం ఉన్నారట. అక్కడే వీరిద్దరినీ అదృష్టదేవత ఆశీర్వదించింది."

"అవునవును. బారన్ డాంగ్లర్ అలాగే చెప్పినట్లు నాకు గుర్తు" అన్నాడు మాంట్ క్రిస్టో. "యూజినీ డాంగ్లర్ చక్కనిది సుమా."

"చాలా చక్కనిది" అన్నాడు ఆల్బర్ట్. "కాని అంత చక్కదనం నేను భరించలేను."

"అయితే ఈ వివాహంపట్ల నీ కంత ఉత్సాహమున్నట్లు కనపడదే!"

"డాంగ్లర్‌కు అపారమైన ధనం ఉంది."

"అయితే? మీరు మాత్రం భాగ్యవంతులు కారా?"

"మాదేముంది? నాతండ్రికి సాలుకి ఏభైవేల ఫ్రాంకులు ఆదాయం. నేను పెళ్లిచేసుకుంటే నేను వేరే ఉండడానికి ఆయన నాకు సాలుకి ఏ పదిపన్నెండు వేలో ఇస్తారు."

"అది చాలదు నిజమే. కాని అన్నీ ధనంపైనే ఆధారపడి ఉండవు. సమాజంలో ఉన్నతి పొందడం, ప్రతిష్ఠ ఆర్జించుకోవడం అంటూ ఉన్నాయి."

"ఆల్బర్ట్ తల అడ్డంగా తిప్పాడు. ఏదో యోచిస్తూ పరధ్యానంగా ఇలా అన్నాడు: నాతల్లికి ఎందుకో డాంగ్లర్ వంశం పట్ల అయిష్టత కలిగింది. నాకొక్క విషయం స్పష్టంగా తెలుసును. ఈ వివాహం జరిగినట్లయితే నా తల్లి దుఃఖానికి అంతుండదు. ఆరు వారాలకిందట ఈ వివాహం స్థిరపడవలసింది. కాని నాకు ఉన్నట్లుండి జబ్బుచేసినందువల్ల అప్పు డది జరగలేదు. రెండు మాసాల కది వాయిదా వేశారు. అప్పుడే తొందరేంలేదు. కాని రెండుమాసాలంటే ఎంతసేపు, ఇట్టే గడిచిపోతుంది. ఈఘాటు తప్పించుకోడం కష్టం. నిజంగా నే నెంత వ్యథపడుతున్నానో మీకు తెలియదు కౌంట్. నిజంగా మీ కిటువంటి చింతలేవీ లేవు కదా!"

"మీకు మాత్రం చింత ఎందుకు? మీరూ బ్రహ్మచారిగానే ఉండిపోవచ్చు."

"అలాగయితే నా తండ్రి ఆశలన్నీ భగ్నమౌతాయి."

"అయితే పెళ్లిచేసుకోండి."

"అవును. కాని దానివల్ల నా తల్లి దుఃఖం చూడలేను."

"అయితే ఈ సంబంధం మానుకోండి."

"అదే చూడాలి. కాని సమయం వచ్చినప్పుడు మీరు నాకు సలహా ఇస్తారా? నా తల్లి దుఃఖాన్ని చూసే బదులు నా తండ్రి కోపాన్ని సహించవచ్చుననుకుంటాను."

మాంట్ క్రిస్టో కొద్దిగా విచలితుడైనాడు. అది కప్పిపుచ్చుకోడానికి డిబ్రేవంక తిరిగి "మీ రేమిటి వ్రాస్తున్నారు?" అన్నాడు.

"ఏవో లెక్కలు వేసుకుంటున్నాను."

"లెక్కలా?"

"అవునండి. కిందటిమాటు హైటి కంపెనీ అమ్మకపు వాటాల ధర పెరిగినప్పుడు డాంగ్లర్‌కి ఎంత లాభంవచ్చి ఉంటుందో లెక్క కడుతున్నాను. దాదాపు మూడులక్షలు లాభం వచ్చి ఉంటుంది."

"ఇదేముంది. గడిచిన ఏడాది స్పానిష్‌యుద్ధంవల్ల ఆయనకి పదిలక్షలు లాభం వచ్చింది."

"హైటీ దేశానికి చెందిన కంపెనీ అంటున్నా రేమిటి?" అన్నాడు మాంట్ క్రిస్టో.

"ఏముంది? ఫ్రెంచి వ్యాపారుల జూదాలకి హైటీ బంగారు పంట. నిన్ననే డాంగ్లర్ 405 చొప్పున వాటాలు అమ్మి మూడు లక్షలు లాభం చేసుకున్నాడు. అదే ఇవాళ అమ్మితే లాభం లేకపోగా ఇరవై, పాతిక వేలు నష్టం వచ్చేదే."

"అయితే నిన్నటి ధర ఇవాళ ఎందుకు పడిపోయింది?"

"వార్తలు ఒకదాని తరవాత ఒకటి వస్తుంటాయి. అది మారుతుంటే వ్యాపారజూదంలో లాభనష్టాలు సంభవిస్తాయి" అన్నాడు ఆల్బర్ట్.

"అంటే ఈ జూదంలో బారన్ డాంగ్లర్‌కి మూడేసి లక్షలు లాభాలూ నష్టాలూ వస్తుంటాయన్నమాట. ఆయనదగ్గ రెంత ధనముందో!"

"అబ్బే! ఆయన కాదు జూద మాడేది." అన్నాడు డిబ్రే. "ఆయన భార్య."

(26-వ పేజీ చూడండి)

అనువాదం: సీతారామ్

# సెప్టెంబరు 5వ తేదీన అన్ని ముఖ్య కేంద్రాలలో విడుదల




* ఆంధ్ర, దత్తమండలములు : నవయుగ ఫిలింసు, విజయవాడ.

* మైసూరుస్టేట్ : ప్రకాశ్ పిక్చర్సు, బెంగుళూరు సిటీ.

* నైజాం స్టేట్ : కర్నాటక ఫిలింసు లిమిటెడ్, బెంగుళూరు సిటీ.

వివరములకు: **ప్రకాశ్ ప్రొడక్షన్సు, శాంతోం, మద్రాసు.**

## చెమిరియా టాకీస్ వారి సాంఘిక చిత్రం

చెమిరియాటాకీ డిస్ట్రిబ్యూటర్సు వారు ఒక తెలుగు సాంఘిక చిత్రమును నిర్మించనున్నారు. దీనికి శ్రీ సి. పుల్లయ్యగారు దర్శకులు. కవి శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతం గారు. సంగీత దర్శకుడు, శ్రీ అశ్వద్ధామ. ఈ చిత్రంలో కొత్త వారికి అవకాశ మివ్వబడుతున్నది. ఇప్పటికి కొన్ని పాటలు రికార్డు చేశారు. షూటింగు త్వరలో ప్రారంభం కాగలదని తెలుస్తున్నది.

## "లోర్నాడూన్"

కొలంబియా వారి టెక్నికలర్ చిత్రం "లోర్నాడూన్" గత శుక్రవారం నుండి మద్రాసు న్యూఎల్ఫిన్‌స్టన్‌లో ప్రదర్శింపపడుతున్నది. 17 వ శతాబ్దంలో ఇంగ్లండులో జరిగినట్లు చిత్రించబడిన ఈ కథలో దుర్మార్గుడైన "డూన్" దుర్గాధిపతినుండి ప్రజలను ఒక యువక వీరుడు రక్షించడం ఇతివృత్తం. బార్బారా హేల్ నాయక పాత్ర, రిచర్డుగ్రీన్ నాయకపాత్ర సమర్థంగా నిర్వహించారు. చక్కని సెట్టింగులు, కత్తియుద్ధాలు, ప్రేమసన్నివేశాలతో ప్రేక్షకులను వినోదపరుప గలిగిన దీ చిత్రం.

## దీక్ష

ప్రకాష్ ప్రొడక్షన్సు వారి "దీక్ష" యీనెల 5 వ తేదీన ఆంధ్రదేశంలో విడుదల అవుతున్నది. ఇందులో జి. వరలక్ష్మి, రామ్‌గోపాల్, శివరాం ముఖ్యపాత్రలు నిర్వహించారు. దీనికి దర్శకులు ప్రకాశరావుగారు. సంగీతదర్శకులు పెండ్యాల నాగేశ్వరరావుగారు.

---



రాజు ఎప్పుడు ఎక్కడ ప్రత్యక్షమవుతాడో తల్లి రత్తమ్మ ఊహించలేదు.

విజయావారి "పెళ్లి చేసిచూడు"లో ఒక దృశ్యం.

## షిన్ షినాకీ బుబ్లాబూ

ప్రఖ్యాత హిందీ చలనచిత్ర నిర్మాత, దర్శకుడు అయిన సంతోషి ప్రస్తుతం 'షిన్ షినాకీ బుబ్లాబూ' అనే చిత్రమును నిర్మిస్తున్నాడు. ఇది సెప్టెంబరు మాసంలో విడుదల కాగలదు. షిన్ షినాకీ అన్నది ఒక బాలిక పేరు. బుబ్లాబూ అన్నది ఒక బాలుని పేరు. ఇది ఒక ప్రణయగాథ ఇతివృత్తంగా గల చిత్రం. ఇందులో దక్షిణ దేశంలో ప్రముఖ నటుడుగా పేరొందిన రంజన్ నాయకుని పాత్రను నిర్వహించుతున్నాడు. రేహనా, సాధనాబోస్, బేబీ తబసుం, తివారీ ఇతర ముఖ్య పాత్రలను నిర్వహించుతున్నారు. సంగీతదర్శకుడైన సి. రామచంద్ర యీ చిత్రమున అత్యంత మనోహరమైన సంగీతం సమకూర్చుతున్నాడని స్టూడియో వార్తలు తెలియజేస్తున్నవి. ప్రఖ్యాత హిందీ కథకుడైన రామానంద్ సాగర్ యీ చిత్రానికి కథ వ్రాశాడు.



ప్రకాష్ ప్రొడక్షన్సువారి "దీక్ష"లో శ్రీమతి జి. వరలక్ష్మి.

## బాల గంగాధర ప్రొడక్షన్సు ప్రారంభోత్సవం

గత ఆదివారంనాడు స్టార్ కంబైన్సు స్టూడియోలో మద్రాసు ఆర్థిక మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు, బాలగంగాధర ప్రొడక్షన్సుకు ప్రారంభోత్సవం జరిపారు. శ్రీమతి జయమ్మ అధ్యక్షత వహించెను. ఆ సందర్భంలో గోపాలరెడ్డిగారు ప్రసంగిస్తూ చలనచిత్రపరిశ్రమ వృద్ధిపట్ల ప్రభుత్వమునకు ఆసక్తి ఉన్నదనీ, ఈ పరిశ్రమ వృద్ధిపొందుటకు అవసరమైన సదుపాయములు చేయుటకు ప్రభుత్వం సిద్ధమనీ అన్నారు. సంస్థ వ్యవస్థాపకులైన వి. వి. పంతులు గారిని అభినందించుతూ ఇదిఅన్ని విధాలా జయప్రదం కావలెనని ఆకాంక్షించారు. వి. వి. పంతులుగారు తాను యీ సంస్థను స్థాపించుటలోగల ఉద్దేశ్యాలను వివరించి యీ సంస్థ నిర్మించనున్న ప్రథమ చిత్రం 'గాంధిస్మృతి' యని ప్రకటించారు. దక్షిణ భారత చలనచిత్ర వాణిజ్య మండలి అధ్యక్షులు రామయ్యగారి వందనములతో కార్యక్రమం ముగిసింది.



'మేరా మున్నా' హిందీచిత్రంలో ఒక సన్నివేశం.

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(22-వ పేజీ తరువాయి)

"నేనే నీ స్థితిలో ఉంటే ఆవిడకో పాఠం చెప్పేవాడిని" అన్నాడు ఆల్బర్ట్.

"ఎల్లా చెపుతావ్?"

"అది చాల సులువు. నువ్వు నోరు తెరిస్తే చాలు స్టాక్ బ్రోకర్లు ప్రతిమాటా వ్రాసుకునిపోతారు. ఆ వీలున్నప్పుడు ఒక్కసారి రెండు మూడు లక్షలు నష్టం వచ్చేలా చేస్తేసరి ఆవిడకి బుద్ధి వస్తుంది."

"అంటే? ఎలాగ?"

"సరిగ్గా చెప్తా విను. ఇవాళ మహారాజుగారు గుర్రపు పందేలకి వెడతారని పుకారు పుట్టించు. వాటాల ధరలు పెరుగుతాయి. రేపు రాజుగారికి పడిశం పట్టింది కాబట్టి పందేలకి వెళ్లరని వార్త పంపించు. అంతే ధరలు పడిపోతాయి. ఆ దెబ్బతో నిన్న కొన్న వాటాలకి ఇవాళ నష్టం వస్తుంది."

డిబ్రే ఈమాటు నవ్వాడు. కాని అతను తత్తరపడుతున్నట్టు మాంట్ క్రిస్టో గమనించాడు. డిబ్రే ఇంక ఆట్టేసేపు ఉండలేదు. ఏదో మిషపైన వెళ్లిపోయాడు. వెళ్ళేముందు మాంట్ క్రిస్టో అతని చెవిలో ఏదో చెప్పాడు. "తప్పకుండా నా కది సమ్మతమే" అని డిబ్రే సమాధాన మిచ్చాడు.

తరవాత మాంట్ క్రిస్టో ఆల్బర్ట్ వంక తిరిగి "మీ అత్తగారిని గురించి డిబ్రేసమక్షంలో అలా మాట్లాడటం మీకు భావ్యమేనా?" అన్నాడు.

"అబ్బెబ్బె! అప్పుడే అత్తగారంటూ రేమిటి? అలా అనద్దు."

"నిజంగా మీ తల్లికి ఈ వివాహంపట్ల అంత ఇష్టం లేదా?"

"నిజంగా నా తల్లి డాంగ్లర్ భార్యని ఇంతవరకూ ఏ రెండు మూడుసార్లో మాత్రం చూసిఉంటుంది. ఎన్నడూ ఇద్దరూ కలుసుకోరు."

"అయితే నేను దాపరికం లేకుండా మీతో మాట్లాడుతాను. ఆట్వీల్‌లో నా యింటికి డాంగ్లర్ దంపతుల్నీ, విల్‌ఫర్ట్ దంపతుల్నీ విందుకు ఆహ్వానించదల్చుకున్నాను. ఈ విందుకు మిమ్మల్నీ, మీ తలిదండ్రుల్నీ కూడా ఆహ్వానించినట్లయితే వివాహనిశ్చయంకోసమనే అపోహ కలగవచ్చును. అప్పుడు మీతల్లికి నాపట్ల విముఖత కలిగే వీలుంది. అది మాత్రం నాకెన్నడూ ఇష్టం ఉండదు. మీ తల్లిదృష్టిలో నే నెప్పుడూ హితునిగానే ఉండాలని నాకోరిక."

"నిజంగా, మీరు మమ్మల్ని విందుకి ఆహ్వానించకుండా ఉంటే నేను కృతజ్ఞుణ్నే. మాతల్లికి మీపట్ల అపారమైన గౌరవాదరాలున్నాయి. ఆనాడు మీరు మాయింటివద్దనుంచి వెళ్లిపోయిన తరవాత నేనూ నాతల్లీ మిమ్మల్నిగురించి గంటసేపు ప్రసంగించాం. మీకు కూడా ఆమెపట్ల అంత ఆదరముందని తెలిస్తే, ఆమె ఆనందిస్తుంది. కాని మాతండ్రిగారికి కోపంకూడా వస్తుంది."

మాంట్ క్రిస్టో నవ్వాడు.

"మీతండ్రి కొక్కరికే కాదు కోపంవచ్చేది. డాంగ్లర్ దంపతులు నాకు మర్యాద తెలియదని కోపగిస్తారు. మీతో చనువుగా ఉంటానని వారికి తెలుసును. తెలిసి కూడా మీరు విందుకి రాకపోయినప్పుడు వారికి కోపంవస్తుంది. అందువల్ల మీరు విందుకి రాకపోవడానికి కారణమొకటి కల్పించుకోవాలి. కల్పించుకుని నాకది వ్రాతమూలకంగా తెలియచెయ్యాలి."

"అసలు నిజమైన కారణమే చెప్పవచ్చు, మాతల్లి సముద్రపుటొడ్డున కొన్నాళ్లు ఉండాలనుకుంటోంది. మీయింట్లో విందెప్పుడు?"

"శనివారంనాడు"

"ఇవాళ మంగళవారం. సరే, రేపు సాయంత్రమే బయలుదేరి వెళ్ళిపోతాం. ఇప్పుడే డాంగ్లర్ ఇంటికివెళ్ళి మేమిద్దరం వెళ్లిపోతున్నట్లు చెప్తాను. ఇంక మీరు నన్ను విందుకి పిలిచారనీ కాని ప్రయాణంవల్ల రాలేకపోతున్నట్లు మీకు తెలియపరిచాననీ వెల్లడి చేద్దాం."

"అది బాగుంది."

"బాగానే ఉంది. ఇదిక్కడికి స్థిరమే. అయితే రేపు మేము వెళ్లిపోయేలోగా మా అమ్మను మీ రొకసారి చూడాలి."

"రేపటిలోగానా? కష్టం."

"పోనీ ఇవాళ మీకు తీరికేగదా? ఇప్పుడే నాతో రండి. రాత్రికి మా యింటివద్దనే భోజనం చేద్దాం. మా తల్లిగారిని మీ రొక్కసారే చూశారు. ఈపూట చాలసేపు ముగ్గురం మాట్లాడుకోవచ్చు. మా తండ్రిగారివాళ ఇంటికి రారు.

"కాని నేను రాలేను."

"అలా అంటే సరిపోదు. ఇప్పుడిప్పుడే మిషపెట్టి విందులు తప్పించుకోడం నాకు నేర్పారు. అందువల్ల నే నంత సులువుగా మీ మాట నమ్మను."

"అయితే మీకు నిదర్శనం చూపుతాను."

"హు! ఇది రెండోసారి మీరు మా అమ్మతో విందుకి రావడానికి నిరాకరించడం. బహుశా మీ కది ఇష్టంలేదు కాబోలు."

మాంట్ క్రిస్టో ఉలిక్కిపడ్డాడు. "కాదు కాదు. మీరు అనుమానించవద్దు. ఇప్పుడే చెప్తాను." అంటూ చేగంట మోగించి పరిచారకుని పిలిచాడు.

"బాప్టిస్టిన్! ఇవాళ ఉదయం నీకేం చెప్పాను?"

"అయిదుగంటల తరవాత అతిథు లెవరినీ రానివ్వవద్దని చెప్పారు."

"తరవాత?"

"తరవాత మేజర్ కావల్కాంటీని తప్ప మరెవర్నీ ప్రవేశపెట్టవద్దన్నారు."

"విన్నారా ఆల్బర్ట్? మేజర్ కావల్కాంటీ అంటే ఇటలీ పూర్వ రాజరికవంశానికి చెందినవాడు. ఆయన కుమారుడు ఆండ్రీ పారిస్ సమాజంతో పరిచయం చేసుకోడానికి వస్తున్నాడు. తండ్రి కోటీశ్వరుడు. కుమారుని కేలోటూ ఉండదు. ఇవాళ ఆ తండ్రి తన కుమారుని తీసుకొచ్చి నాకు ఒప్పగిస్తాడు. ఈ కర్తవ్యంలో మీరు తప్పకుండా సహాయపడాలి కూడా."

"తప్పకుండా. అయితే ఈయన మీ పాతమిత్రుడా?"

"అంత ఎక్కువ మైత్రిలేదు. యువకుని ఈ సమాజంతో పరిచయపరచడమే నా పని. ఆపైన అతని బుద్ధి అతన్ని ఎటు తీసుకుపోయినా నాకు నిమిత్తంలేదు."

"సరేఅయితే. తిరిగి మనం ఆదివారంనాడు కలుసుకుందాం. అన్నట్లు చెప్పటం మరిచిపోయాను. ఫ్రాంజ్ వద్దనుంచి నాకు ఇవాళే ఉత్తరం వచ్చింది?"

"ఆయనకి నన్నుగురించిన శంక తొలగిపోయిందా?"

"లేదనుకుంటాను. మిమ్మల్నిగురించి అతనికి బొత్తిగా తెలియడం లేదట."

"కాని మంచివాడు. అతని తండ్రిపేరు జనరల్ క్వెస్నెల్ కాదూ? 1815 లో హత్యచెయ్యబడిన సైనికాధికారి కాదూ?"

"అవును. బోనపార్టిస్టులు ఆయన్ని హత్యచేశారు."

"అవును. అతనికి కూడా వివాహం స్థిరపరిచారు కాదూ?"

"అవును. విల్‌ఫర్ట్ కుమార్తె వాలంటిన్ వధువు."

"ఓ"

"సరే, నాసంగతి తెలుసుగా మీకు / యూజినీడాంగ్లర్." అంటూ ఆల్బర్ట్ పకపక నవ్వాడు.

"నవ్వుతున్నారా ?"

"అవును, రెండు సంబంధాలూ ఒక లాగే ఉన్నాయి. మా ఇష్టాయిష్టాలతో పైవారికి పనిలేదు." అంటూ ఆల్బర్ట్ లేచి నిలబడ్డాడు.

"వెళ్లిపోతున్నారా ?"

"ఇంకా ఎంతసేపు ? రెండుగంటలనించి లోకాభిరామాయణం మాట్లాడుతున్నాం. మిమ్మల్ని విసిగిస్తున్నాను. ఒకమాట. మీ అతిథి తన కుమారుణ్ణి ఈనగరంలో స్థిరపరచాలని కోరుకుంటే, ఆ కుమారునికి ధనంతో సహా వచ్చే వధువు కావాలనుకుంటే, ఆ వధువు ఒక బారన్ కూతురే కావాలనుకుంటే, ఆ వధువుని వెతకడానికి నేను మీకు సర్వవిధాలా సహాయపడతాను. మీరు సౌకర్యం చేసుకుని నన్ను ఆ జన్మబ్రహ్మచారిగా ఉంచగలిగితే ఆజన్మాంతం మీకు కృతజ్ఞతతో ఉంటాను."

"సాధించ లేని దేదీ ఉండదు." అన్నాడు మాంట్‌క్రిష్టో, గంభీరభావంతో. తరవాత తనగుమాస్తాని పిలిచాడు.

"బర్టుక్సియో ! శనివారంనాడు ఆట్వీల్ భవనంలో విందు జరుగుతుంది. భవనాన్ని అలంకరించడానికి ఏర్పాట్లు చెయ్యి."

"అలంకరించడానికి ముందు బాగుచెయ్యవలసింది చాలా ఉంటుందండి" అన్నాడు బర్టుక్సియో.

"అవసరమైతే అంతా వెంటనే చేయించు. తెరలు మార్పించు. పడకగదిని మాత్రం ఎప్పటిమాదిరిగానే ఉంచు. దాన్ని మార్చవద్దు. గదిద్వారాని కున్న ఎర్ర తెరకూడా మార్చవద్దు. తోటకూడా యేమీ మార్చవద్దు. తెలిసిందా ?"

"విందు కెవరు వస్తారో నేను తెలుసుకోవచ్చునా ?"

"అనవసరం."

బర్టుక్సియో తలవంచుకుని వెళ్ళిపోయాడు.

## 55

సాయంకాలం ఏడు గంటలకి మాంట్‌క్రిస్టో ఇంటివద్ద ఒక చిన్న బగ్గీ ఆగింది. అందులోనుంచి ఏభైరెండేళ్ళ వ్యక్తి ఒకడు దిగి సావడిలోకి వెళ్లాడు. మాంట్‌క్రిస్టో అతిథిని ఆహ్వానించాడు. "మీరు వస్తారని నిరీక్షిస్తున్నాను" అన్నాడు.

"అయితే నేను వస్తున్నట్లు తమకు ముందే తెలుసునా?"

"తెలుసును. ముందే నాకు కబురందింది."

"ఇదీ నయమే. నేను స్వయంగా నా రాకనుగురించి ముందుగా తమకు తెలియపరచలేదే అని సంకోచిస్తున్నాను."

"సంకోచం ఎందుకు?"

"అసలు వస్తున్న దెవరో తమకు తెలుసునో లేదో నని. అయితే వస్తున్నది నే నేనని కూడా మీకు తెలుసునా?"

"తెలుసును." అన్నాడు మాంట్‌క్రిస్టో.

అతిథి సంకోచంతో మాంట్‌క్రిస్టో వంక చూశాడు. ఏం చెయ్యాలో ఏం చెప్పాలో అతనికి తోచడంలేదని ఆ చూపులో స్పష్టపడుతోంది.

మాంట్‌క్రిస్టో ఇలా అన్నాడు : "మీ పేరు మార్క్విస్ కావల్కాంటీ కాదూ? మీరు ఇదివరలో ఆస్ట్రియన్ సైన్యంలో మేజర్ హోదాలో పనిచేశారు."

"ఆ? మేజర్‌గానా?" అన్నాడు అతిథి తన దుస్తులవంక చూసుకుంటూ. ఆ దుస్తులు సైనికోద్యోగులు ధరించేవే. కాని అటువంటి దుస్తుల్ని ఆ వ్యక్తి జన్మలో చూడలేదనిపిస్తుంది. ఆ దుస్తుల్లో ఎలా మెలగాలో కూడా అతనికి తెలియదని స్పష్టపడుతూనే ఉంది. మాటిమాటికీ భుజాలపైన నక్షత్ర పతకాల వంకా, ఛాతిపైన పతకాలవంకా బొత్తాములవంకా వింతగా చూసుకుంటున్నాడు.

ఇది గమనించి మాంట్‌క్రిస్టో ఇలా అన్నాడు: "అవును. మీరు మేజర్ హోదాలో పనిచేశారు."

"ఓహో! అలాగా బాగుంది. నేను మేజర్‌ని అంతకంటె ఇంక పెద్ద హోదా వొద్దులెండి..."

మాంట్‌క్రిస్టో అతనివంక తీక్షదృష్టితో పరికించి. "మిమ్మల్ని నావద్దకు ఒకరు పంపారు, అవునా ?"

"చిత్తం"

"పంపినవారి పేరు బుసోనీ; ఆయన నొక ఫాదరీ.

"చిత్తం."

"మీ చేతికి ఉత్తరమేదైనా ఇచ్చారా ?"

"ఇదుగోనండి."

"మాంట్‌క్రిస్టో ఉత్తరం తీసి చదివాడు. మేజర్ కావల్కాంటీ కళ్లు పెద్దవిచేసి మాంట్‌క్రిస్టోని నిరీక్షణభావంతో చూస్తున్నాడు.

మాంట్‌క్రిస్టో చదువుతూ ఇలా అన్నాడు : "అవునవును. మేజర్ కావల్కాంటీ ఆదాయం సాలుకి అయిదులక్షలు. ఓ అయిదులక్షలా, చాలా బాగుంది."

"ఎంతండి ?" అన్నాడు మేజర్. "ఎంతన్నారు ? సాలుకి అయిదులక్షలా ?"

"అవును. అక్షరాలా అయిదులక్షలు."

"కానివ్వండి. అయిదులక్షలే స్థిరం. నాకు సమ్మతమే. కాని ఇంత ఆదాయం వస్తుందని నేను కలలో కూడా అనుకోలేదండి."

"ఇశ్" అన్నాడు మాంట్‌క్రిస్టో. "మీరు మేజర్‌లాగ మాట్లాడటంలేదు. కనీసం ఇప్పుడైనా సరిగా నేర్చుకోండి." తరవాత మళ్ళీ ఉత్తరం చదువుతూ "వీరికి ఒక్కటే లోటు. అది తీరనంతవరకూ వీరికి నిద్రపట్టదు. సుఖం ఎరగరు."

"ఆ!" అన్నాడు మేజర్ నిస్పృహతో "అదొకటా ?"

"అవును. పుట్టినప్పుడే దొంగలపాలైన కుమారుడు దొరికేవరకూ వీరికి సుఖమనేది ఉండదు."

"ఓహో !" అన్నాడు మేజర్. "అయితే ఆ కొడుకు ఎప్పుడు తప్పిపోయినట్లండి ?"

"పాపం! అయిదోఏట" అన్నాడు మాంట్‌క్రిస్టో.

"పాపం" అన్నాడు మేజర్.

"ఇశ్."

మళ్ళీ ఉత్తరం చదవడం మొదలుపెట్టాడు మాంట్‌క్రిస్టో. "తమరు తప్పక ఆ కుమారుని వెదికి తండ్రివద్దకు చేర్చగలరనే దృఢవిశ్వాసంతో మీ వద్ద కీయన్ని పంపుతున్నాను. ఆ కుమారునికోసం పదిహేనేళ్ళనుంచీ తండ్రి తహతహ లాడుతున్నారు."

మేజర్ చేతనైనంతవరకూ దుఃఖం నటిస్తూ, "పదిహేనేళ్లనుంచి ఆ కొడుకుకోసం వెతుకుతున్నానన్న మాటండి" అన్నాడు.

"ఆ కొడుకుని మీవద్దకు చేర్చగల శక్తి ఉంది."

మేజర్ దుఃఖాభినయాన్ని ఒక్కసారిని దులిపివేసు.

"ఓహోహో!" అన్నాడు. "అయితే తమరు ఉత్తరాన్ని చివరి వరకూ చిత్తగించండి."

"అవును. కింద ఇంకా ఏదో వ్రాసిఉంది. 'బాంకులకు వెళ్లి ధనం తీసుకునే చిక్కు మేజర్ కావల్కాంటీకి కలక్కుండా, వారికి ప్రయాణం నిమిత్తం రెండు వేలు, మీ పేర 48 వేలకు హుండీ పత్రమూ ఇస్తున్నాను.'"

మేజర్ ఆత్రుతతో మాంట్‌క్రిస్టోవంక చూశాడు.

"సరే. సమ్మతమే." అన్నాడు మాంట్‌క్రిస్టో.

"అంటే?" అన్నాడు మేజర్.

"అంటే ఈ ధనం మీకెప్పుడు కావాలంటే అప్పుడిస్తాను."

"చిత్తం. నేను మేజర్‌నండి. కాని ఈ డబ్బుగురించిన షరతుకి మీ రంగీకరించరేమో నని భయపడ్డానండి. తమ కంగీకారం కాకపోతే నేను పారిస్ వీధుల్లో అడుక్కు తిరగవలసిందే కాని వేరే దారి లేదండి."

"మీరు భయపడనక్కర్లేదు మేజర్."

మేజర్ సంతోషానికి మేర లేదు. "అయితే అదిప్పుడే దయ చేయించగలరా?"

"తప్పకుండా" మాంట్‌క్రిస్టో గంట మోగించి పరిచారకుని పిలిచాడు. సావడిలో ఒక ప్రక్కకు వెళ్లి పరిచారకుని ప్రశ్నించాడు. "ఏం?"

"యువకుడు వచ్చాడండి. ఈ ప్రక్కగదిలో కూర్చోబెట్టానండి."

"సరే. వెళ్లు"

మాంట్‌క్రిస్టో దగ్గరికి రాగానే మేజర్ కావల్కాంటీ "నిజంగా తమరి నింతగా చిక్కులు పెట్టుతున్నందుకు నన్ను క్షమించండి" అన్నాడు.

మాంట్‌క్రిస్టో మాట్లాడలేదు. పరిచారకుడు వచ్చి ఒక గ్లాసులో మద్యంపోసి ఇచ్చాడు. మేజర్ అది పుచ్చుకుని ఒక్క గుక్కలో తాగేశాడు.

మాంట్‌క్రిస్టో ఇలా అన్నాడు. "లుక్నోలో మీ నివాసం కాదూ? మీకు అపారమైన భాగ్యముంది. సర్వసంపదలూ ఉన్నాయి. ఏ లోపమూ లేదు."

"చిత్తం. నాకు సర్వం ఉన్నాయండి."

"అయితే ఒక్కటే లోటు."

"అవునండి." అంటూ మరొక గ్లాసు మద్యం పుచ్చుకున్నాడు.

"అయితే ఏదీ మీ కథ మరొకసారి చెప్పండి. మీరు బ్రహ్మచారులని అందరూ భావిస్తారు. కాని మీ యీ కుమారు డెవరు?"

"అవునండి. బ్రహ్మచారిననే అందరూ అనుకుంటారండి. కాని నిజంగా..."

"అలా కాదు. మీకు వివాహం కానిమాట నిజమే. కాని చిన్నతనంలో ఒకసారి కాలుజారినందువల్ల ఇటువంటిది సంభవించింది. కాని ఆ రహస్యాన్ని మీ రెన్నడూ ఎవరికీ తెలియనివ్వలేదు."

"అంతేనండి. కాని..."

"ఆ తల్లి ప్రతిష్ఠను కాపాడ్డంకోసం గోప్యంగా ఉంచారు."

"అంతేనండి. పాపం ఆ అమాయకురాలికోసం." అంటూ ప్రక్కనున్న బిస్కట్లు జోడించి నోట్లో కుక్కుకునా న్ మేజర్.

"ఆమె ఉన్నత వంశానికి చెందినది."

"అవునండి. లేకపోతే నేను అటువంటి పొరపాటులో ఎల్లా పడతానండి?"

"అయినా ఆమె మీ హోదాకు తగినది కాదు."

"కాదు."

"కాని మీరు త్యాగబుద్ధితో ఆమెనే వివాహం చేసుకున్నారు."

"అంతేనండి."

"అయితే మీ వివాహానికి సంబంధించిన పత్రాలు తెచ్చారా?"

"అటువంటివి అవసరం ఉంటా యనుకోలేదండి. నా దగ్గరిప్పుడు లేవండి."

"అవి లేకపోతే ఎలాగ? పని జరగదే"

"చిత్తం. నేనేం చెయ్యానండి?"

"ఫ్రాన్సు దేశంలో ఇటువంటి విషయంలో అతి జాగ్రత్తగా ఉంటారు" అన్నాడు మాంట్‌క్రిస్టో.

"అది నా దురదృష్టమండి"

"కాని అదృష్టవశాత్తూ అవి నాదగ్గ రున్నాయిలెండి."

"నిజంగా? అయితే అది నా అదృష్ట మేనండి. అదే లేకపోతే ఇప్పుడు 48 వేలు నాకు దక్కకుండాపోను."

"అందరూ అన్నిటా అతి జాగ్రత్తగా ఉండడం కుదరదులెండి. బుసోనీ మీ విషయంలో చాలా జాగ్రత్త తీసుకున్నారు."

"నిజమండి. ఆయన మహానుభావుడు."

"ఇదిగో మీ వివాహ పత్రాలు."

"అవునండి." అంటూ మేజర్ పత్రాలు తిరగవేశాడు.

"తరవాత మీ కుమారుడు ఆండ్రీ కావల్కాంటీ నామకరణం నాటి పత్రం ఇదుగో. ఈ పత్రాలన్నీ తీసుకుని భద్రపరచండి, తరవాత మీ కుమారునికి ఒప్పగించండి."

"చిత్తం. కాని తీరా వాడు పారవేసుకుంటే..." అన్నాడు మేజర్.

"అవును పారవేసుకుంటే ఏమౌతుందో తెలుసా?" అన్నాడు మాంట్‌క్రిస్టో.

"పారవేసుకుంటే మళ్ళీ ఆ చర్చిలో నకళ్లకోసం వెళ్లాలన్నమాట!"

"అంటే దానర్థం మీకు తెలుసునా?"

"తెలుసునండి."

"మంచిది. అయితే ఆ పత్రాల విలువ ఎటువంటిదో మరిచిపోకండి."

"మరిచిపోనండి."

"అయితే మీ భార్య సంగతి?"

"పాపం, పోయిందండి" అన్నాడు మేజర్.

"అవును. పోయి పదేళ్ళయింది."

"పదేళ్ళండి. పదేళ్ళనించీ దుఃఖంతో కుంగిపోతున్నానండి."

"అయితే పారిస్ సమాజంలో ఈ కథ పనికిరాదని మరిచిపోకండి. మీ కొడుకుని విద్యకోసం విదేశాలకు పంపారు మీరు. విద్యపరిపూర్తికోసం అతన్ని పారిస్‌కి పంపుతున్నారని చెప్తే చాలు."

"చిత్తం. అలాగే చెప్తానండి."

"సరే. అయితే. ఇక్కడే ఉన్నాడు. చూడండి."

"ఎవరండి?" అన్నాడు మేజర్."

"పదిహేనేళ్లనించీ ఎవరికోసం తపిస్తున్నారో అతను."

"అంటే?"

"అంటే మీ కుమారుడు ఆండ్రీ కావల్కాంటి."

"ఓ! అలాగా? తప్పకుండా. ఏడీ నా ముద్దుల కొడుకు?"

## మళయాళ, అరవ భాషలలో

*అఖండ విజయమును ఆర్జించుకొన్న సాంఘిక చిత్రము*



కె & కె. ప్రొడక్షన్స్ వారి

# జీవిత నౌక

తెలుగు భాషలో
ఆంధ్రదేశమంతటా
సెప్టెంబర్ నెలలో విడుదల

*Released through* **THE VAUHINI PICTURES Ltd.**

**MADRAS...VIJAYAWADA...TADPATRI**

"తొందరపడకండి. తండ్రిని కలుసుకునే ముందు అతనికి బుద్ధులు గరపవలసిన అవసరం ఉంది."

"చిత్తం. కాని బుసోనీ ప్రయాణపు ఖర్చుల కిచ్చిన రెండు వేలలో మిగిలిన కొద్ది చిల్లరతప్ప నావద్ద డబ్బు లేదండి."

"మీకు ఇప్పుడు కావాలా? అయితే ముందు ఈ యెనిమిది వేలూ తీసుకోండి. మీ పద్దులో జమ కడతాను."

ఎనిమిది వేలూ చూసేసరికి మేజర్ కళ్లు మెరమెర లాడాయి.

"ఇంక మీకు నలభై వేలు బాకీ" అన్నాడు మాంట్ క్రిస్టో."

డబ్బు జేబులో దాచివేస్తూ మేజర్ "రసీ దివ్వనాండి?" అన్నాడు.

"ఇప్పు డక్కర్లేదు. మిగతా నలభై వేలూ తీసుకున్న తరవాత మొత్తానికి ఒకటే రసీ దివ్వవచ్చును. ఒకమాట. మీ రా దుస్తులు మార్చివెయ్యాలి."

"మరే దుస్తులు ధరించాలండి?"

"మీ ట్రంకులో ఏవుంటే అవి."

"కాని నేను ఉత్తచేతుల్తో వచ్చానండి. నాకొక ట్రంకు అంటూ లేదండి."

"మీరు మరిచిపోయుంటారు. ప్రిన్సెస్ హోటల్లో ఒక గది అద్దికి తీసుకున్నారు మీరు. మీ నౌకరు ముందే మీ ట్రంకు హోటల్ కి చేర వేశాడు. మీ రిక్కడే ఉండండి" అంటూ మాంట్ క్రిస్టో తెర తొలగించుకుని లోనికి వెళ్లాడు.

## 56

మాంట్ క్రిస్టో ప్రక్కగదిలోకి వెళ్లేసరికి, అక్కడ ఒక యువకుడు సోఫాపైన కాళ్లుచాచి కూర్చున్నాడు. మాంట్ క్రిస్టో ప్రవేశించగానే ఒక్క ఉదుటున లేచి నిలబడ్డాడు.

"నువ్వు ఒకరివద్దనుంచి ఉత్తరం తెచ్చావు కాదూ?" అన్నాడు మాంట్ క్రిస్టో.

"అవునండి. కాని ఉత్తరంలో ఆఖరున సంతకం చూసిన తరవాత, ఆ విషయం మీకు చెప్పడానికి సంకోచించానండి."

"సంతకం ఏముంది? సింద్ బాద్ అని కాదూ?"

"అవునండి. కాని అరేబియన్ దేశస్థుల కట్టుకథల్లో ఆ పేరు వినడమే కాని, మళ్లీ ఆ పేరు పెట్టుకున్న వ్యక్తిని నేను జన్మలో ఎరగనండి."

"అయితే అతను అరబ్బీల సంతతివాడై ఉండవచ్చు. కాని అతన్ని నే నెరుగుదును, అతను బ్రిటిష్ దేశస్థుడు. అసలు పేరు లార్డ్ విల్మోర్."

"ఓ! అదా సంగతి! కాని చిత్రంగా ఉందండి" అన్నాడు ఆంద్రీ కావల్కాంటీ.

"అయితే నీ కథా, నీ వంశచరిత్రా, కొంచెం చెప్పు."

"ఏముందండి? మీరు చెప్పినట్లు నా అసలు పేరు ఆంద్రీ కావల్కాంటీ. కావల్కాంటీవంశం చాలా పురాతనమైనది. నా తండ్రిగారు భాగ్యవంతులే అయినప్పటికీ కొన్ని దుర్ఘటనలవల్ల మా వంశం చితికిపోయిందండి. నా తండ్రిని నేను చూసి పదిహేను సంవత్సరా లయిందండి. నాకు జ్ఞానం తెలిసినప్పటినించీ నేను నా తండ్రికోసం వెతుకుతున్నానండి. ఇంతలో సింద్ బాద్ అనే పెద్ద మనిషివద్దనుంచి నాకు ఒక ఉత్తరం వచ్చింది. కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టోని కలుసుకున్నట్లయితే నేను నా తండ్రిని చూడ గలుగుతానని ఉత్తరంలో చెప్పబడింది."

"బాగుంది. పాపం నీ తండ్రి మేజర్ కావల్కాంటీ ఇక్కడే నీకోసం నిరీక్షిస్తున్నారు."

"ఆ! ఆ! ఆ పేరు నాకు బాగా గుర్తేనండి. మేజర్ కావల్కాంటీ నిజంగానే పాపం నా తండ్రి ఇక్కడున్నారా?"

"ఉన్నారు. ఆయనకూడా ఇలాగే ఒక ఉత్తరం వచ్చింది. పెద్ద మొత్తంలో ధనం ఇచ్చినట్లయితే కొడుకుని ఒప్పగించగలరని ఆయనకి ఆ ఉత్తరంలో తెలపబడింది. అలాగే ఆయన డబ్బు చెల్లించారు. నువ్వు ఇన్నాళ్లు ఎక్కడున్నావు?"

"నేను... నేను..."

"దక్షిణఫ్రాన్స్ లో ఉంటున్నావు."

"కాని నా తండ్రి నన్ను ఎల్లా గుర్తుపడతారు? పదిహేనేళ్లలో నేను చాలా మారిపోయుంటాను."

"నిజమే. కాని ప్రకృతి బలీయమైనదికదా. అంతర్వాణి ఆయనకి చెప్తుంది. నిన్ను చూసీ చూడగానే ఆయన గుర్తుపట్టేస్తారు."

"చిత్తం. ఆ మాటే మరిచిపోయానండి."

"అయితే నీ తండ్రికి ఇంకా ఒక చింత మిగిలిఉంది. ఒకరి అదుపులో లేకుండా ఇంతకాలం నువ్వు తిరిగావు. నీకు దుస్సహవాసాలవల్ల దురభ్యాసాలు అలవడినవేమోనని ఆయన భయపడుతున్నారు. నువ్వు మీ వంశప్రతిష్ఠకు తగినట్లు ఇకనుంచీ ప్రవర్తించ గలవా?"

"అయ్యా! నన్నుగురించి నా శత్రువు లెవరైనా మీకు నేరాలేవైనా......"

"నిన్నుగురించి మొట్టమొదటగా లార్డ్ విల్మోర్ చెప్పగా విన్నాను. నిన్ను ఉన్నతికి తేవాలని ఆయన కాంక్ష. నిన్ను మళ్లీ నీ తండ్రిదగ్గర ఎలాగైనా చేర్చాలనుకున్నాడు. విల్మోర్ భాగ్యవంతుడు. ఉత్తముడు. ఉదార పురుషుడు. అతనికి నేను కూడా సహాయపడతానని మాట ఇచ్చాను. కాబట్టి ముందుగా నాకు నిజం చెప్పు. ఇంతకాలం నువ్వు ఎక్కడెక్కడ తిరిగావు? నీ వంశ గౌరవం నీకు తెలుసునా? ఆ గౌరవాన్ని నువ్వు నిలుపుకో గలవా?"

"ఇన్నాళ్లు నే నెక్కడెక్కడ తిరిగినా, మంచి విద్యనే పొందానండి" అన్నాడు ఆంద్రీ కావల్కాంటీ. "నన్ను ఎత్తుకు పోయినవారు కార్సికన్లు. కాని నన్ను ఎంతో దయతో, ప్రేమతో పెంచారు. నన్ను బానిసగా అమ్మడంకోసం ప్రయత్నించారండి."

"అదంతా సరే. నీ ఇష్టంవచ్చినట్లు నువ్వు చేసుకో. కాని నేను నీ కొక సలహా ఇస్తున్నాను. నీ జీవితంలో నువ్వింతవరకూ ఏమేమి చేశావో ఎవరితోనూ ఒక్కమాట చెప్పకు. ఎన్ని మెరుగులు పెట్టుకున్నా నీవంటి ద్రిమ్మరిని లోకం నమ్మదు సుమా. కాబట్టి జరిగినదానిజోలి కెన్నడూ వెళ్లవద్దు. అది అందరికీ తెలిసినట్లయితే సమాజంలో మీ ఉన్నతవంశానికి తగిన గౌరవం నీకు లభించకపోవచ్చును. నీకు లభించినది మృతనష్టపు భాగ్యమని హేళనచెయ్యగలరు."

"మీ సలహా శిరసావహిస్తాను."

"అయితే నువ్వు మరీ భయపడవద్దు. ఒక దోషం కప్పుకో డానికి రెండు తప్పటడుగులు వెయ్యకు. మంచిమంచివాళ్లతో మైత్రి ఏర్పరచుకో. నువ్వు ఎక్కడినించో ఊడిపడినట్లు ఎవరినీ అనుమానించనివ్వకూడదు."

ఆంద్రీ ముఖం ముడుచుకున్నాడు.

మాంట్ క్రిస్టో అన్నాడు: "నీ దోషా లన్నిటినీ నా వద్ద

(46-వ పేజీ చూడండి)




# "తక్కువ తిన్నదెవరు?"



రచన: కవిరావు

శంభుశాస్త్రి శిష్యుడైన
'జంబు'గాని తోడ్కొని
గొప్పవారి యింటి పప్పు
దప్పళాని కేగెను.

వడలు మొదలుగాగ పిండి
వంటలెల్ల బెట్టగ,
పొట్టపగిలి పోవునట్లు
పట్టుబడిని బట్టిరి.

వళ్ళు మరచి శంభుశాస్త్రి
కళ్లు తేలవేయుచు,
ఈడ్చుకొనుచు 'జంబు' తోడ
యింటిదారి బట్టెను.

పావుకోళ్లు గలవా ? లేవా ?
పాదములకు తనకని
మధ్యలోన గురువున కను
మాన మొకటి వచ్చెను.

నడ్డివంచి చూడ బొజ్జ
అడ్డువచ్చి జంబుతో
"పాదరక్షలున్న వేమొ
పార జూడు" మనియెను.

మెక్కి మెక్కి 'జంబు'డసలె
దిక్కు తెలియకుండెను.
చూచి చూచి కొంతసేపు
చివరి కిట్లు చెప్పెను.

"కంటిచూపు కానువరకు
మింటివైపు చూచినా
స్వామివారి కాలిజోళ్ల
జాడలేదు గురువరా!"

పళ్లునూరి శంభుశాస్త్రి
పళ్లుకొరికి యిట్లనె :
"బండవెధవ ! పావుకోళ్లు
కొండకెట్లు పోయెరా ?"

"తమరికంటె తక్కువిపుడు
తిన్నదెవరు ? గురువరా !"
శిష్యుడిట్టు లనగ శంభు
శాస్త్రి విస్తుబోయెను.

# కలియుగం

ఆవేళ నేను కాలేజీ సీటుకోసం ఏలూరువెళ్లి వస్తున్నాను. జనం రద్దీగా వుండటం మూలాన పైబెర్తు ఎక్కికూర్చున్నాను. క్రింద కూర్చున్నవారు ఏదో పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. ఇంతలో ఎవరో అన్యాయాన్ని గురించి ఒక చిన్న ఉపన్యాసం దంచాడు. ఇంతలోఅందుకున్నాడు ఓ పూర్వాచార పరాయణుడైన ఒక పెద్ద మనిషి, అన్యాయాన్ని గురించి ఓ చిన్నకథ. ఆకథనే నేనిక్కడ మీకందరికీ చెబుతున్నాను.

ఆకాలంలో ధర్మరాజు పరిపాలనలో వుంది భారతదేశం. అంటే ధర్మం నాలుగు పాదాలమీద నడుస్తోందన్న మాట. అటువంటి రోజుల్లో ఎల్లవరం అనే గ్రామంలో అవధాని అనే బ్రాహ్మణుడొకడుండేవాడు. ఆయన భార్యామణి పేరు అచ్చమ్మ. అవధాని చిన్నప్పుడే పెళ్ళి చేసుకున్నాడు. అప్పటి నుండీ యాయవారం చేసుకుని పొట్ట పోసుకుంటూ, తద్దినాలు వగైరాలకి హాజరయి కాస్త స్థిరాస్థి కూడా సంపాదించాడు.

ఏభై ఏళ్లొచ్చినా అవధానికి సంతాన ప్రాప్తి కలుగలేదు. సంపాదన బాగానే వుందిగాని తిండానికి ఒక్క కొడుకైనా లేకపోయె. కర్తవ్యాన్ని గురించి అచ్చమ్మ, అవధాని, బాగా బాగా ఆలోచించి, తీర్థయాత్రలు చేసి రావడానికి నిశ్చయించుకున్నారు. అవధాని మర్నాడు తన ఆస్తినంతా అమ్మివేశాడు. ఆసొమ్మంతా ధనరూపాన వుంటే ఎవరైనా దొంగిలిస్తారని, ఆసొమ్ము పెట్టి ఒక విలువైన రత్నాన్ని కొన్నాడు. తీర్థయాత్రలకి కాస్తసొమ్ము దగ్గర వుంచుకున్నాడు. ఇంతలో ఒ చిన్న ఆలోచన అవధాని బుర్రలో జెర్రిపిల్లలా దూరి, ఎలకపిల్లలా గొడవ చేయసాగింది ఏమిటీ అంటే రత్నాన్ని ఎవరిదగ్గర దాచటమా అని. అచ్చమ్మతో ఆలోచించాడు. పక్కింటి కోమటి కోటయ్య దగ్గర దాచుకుంటే బాగుంటుందని సలహా చెప్పింది అచ్చమ్మ.

అవధాని, అచ్చమ్మ ఆలోచన ప్రకారం రత్నాన్ని కోమటి కోటయ్యకు దాచనిచ్చాడు. పెళ్లాం సమేతంగా యాత్రలకి బయలుదేరాడు. దేశాలన్నీ తిరిగాడు.

యాత్రలు పూర్తిచేసి ఇంటికొచ్చేసరికి ఒక సంవత్సరం అయింది. ఈలోపున దేవుని దయవల్ల వాళ్ళకి ఒక్క కొడుకు పుట్టాడు. అవధాని పిల్లాడికి బారసాల అమోఘంగా చేయాలని సంకల్పించుకున్నాడు. అందుకని కోటయ్యదగ్గరకు వెళ్ళి తన రత్నాన్ని తనకిమ్మని అడిగాడు.

రచన:
**అయ్యగారి శ్రీరామచంద్రమూర్తి**

“ఏమిటీ! రత్నమా? నాకెక్కడిచ్చావ్? చాల్చాల్లే” అన్నాడు కోటయ్య. “భలేవాడివే కోటయ్యా ఆస్తినంతా అమ్మి రత్నంకొని, దాచమని నీకిస్తే ఇవ్వలేదంటావేమయ్యా.” అన్నాడు అవధాని బిక్కమొహం వేసి. ఇల్లా వాళ్ళిద్దరూ తగవులాడుకొంటూ ధర్మరాజువద్దకు వెళ్లారు.

ముందు కోటయ్య చెప్పాడు “మహారాజా! దైవసాక్షిగా ఈ బామ్మడు నాకేమీ ఇవ్వలేదండి; ప్రమాణపూర్తిగా” అన్నాడు. తనుయాత్రలకు వెళ్ళినట్లు ఋజువు చూపించడానికి పెళ్లాంబిడ్డలతో వచ్చాడు అవధాని. తను చెప్పడం మొదలుపెట్టి, “స్వామీ, నేనూ నాపెళ్లాం తీర్థయాత్రలకు బయలుదేరినమాట వాస్తవం. నేను వెళ్లేటప్పుడు కోటయ్యకు రత్నము ఇచ్చినమాటకూడా నా కొడుకు సాక్షిగా నిజమేనండి.” అని పిల్లాడి వంటిమీద చెయ్యివేశాడు. వెంటనే పిల్లాడు చచ్చిపోయాడు.

అబద్ధాలాడి పిల్లాణ్ణే చంపుకున్నాడన్నారు అందరూ. కోటయ్య చంక లెగరేశాడు. అవధాని ఏడుస్తూ పిల్లాడి శవాన్ని భుజంమీద వేసుకుని శ్మశానానికి బయలుదేరాడు. దోవలో నారదమహర్షి ఎదురయి, “ఏం అవధానీ అల్లా విచారిస్తున్నావ్?” అన్నాడు. అవధాని జరిగినదంతా చెప్పాడు. అపుడు నారదుడు “ఓరి వెర్రివాడా

ధర్మరాజు పరిపాలన ఈగంటతో సరి. కలి వచ్చి ఊరు పొలిమేరలో కూర్చున్నాడు. దాని విపరీతమే ఇది. కనుక తక్షణం వెళ్ళి, రెండు రత్నాలిచ్చినట్లు ప్రమాణం చేసి, పిల్లాడివంటిమీద చెయ్యి వెయ్యి. నీపిల్లాడు బ్రతకకపోతే నన్నడుగు" అన్నాడు. అవధానికి ఇష్టంలేకపోయినా నారదుని ప్రోద్బలంవల్ల మళ్ళీ ధర్మరాజువద్దకు వెళ్లాడు. "మహారాజా ఇందాకా తొందరలో మరచానండి. నేను రూఢిగా కోటయ్యకి రెండురత్నాలు నాకుమారుడి సాక్షిగా ఇచ్చానండి." అని కుమారుడి శవంమీద చెయి వేశాడు. పిల్లాడు తక్కున లేచి ఏడవ సాగాడు. అందరూ ఈవింత చూసి మరీ ఆశ్చర్యపోయారు. అసలు కలి ఊళ్ళో ప్రవేశించి అప్పటికి అరగంట అయిందట. ఇదంతా వాని ప్రభావమేనని తర్వాత తెలిసింది. అప్పటినుంచీ కలియుగం ప్రారంభమయి, అన్యాయాలు, అబద్ధాలు పెచ్చు పెరిగిపోయా"యని చెప్పి కథ ముగించాడు పెద్దమనిషి.

నేను దిగవలసిన రాజమండ్రీ స్టేషను దాటి అప్పటికి రెండుగంటలయింది. సామర్లకోటలో దిగి తిరుగు ట్రయినులో రాజమండ్రీ వెళ్లాను. ★






జరిగిన కథ :—

1537 వ సంవత్సరంలో ఇంగ్లండురాజైన హెన్రీకి ఎడ్వర్డు అనే కొడుకూ, నిరుపేద జాన్ కాంటీకి టామ్ అనే కొడుకూ, ఒకేరోజున జన్మిస్తారు. అదేం విచిత్రమోగాని ఇద్దరిదీ ఒకేపోలిక. ఒకరోజున టామ్ రాజభవనంకేసి వెళ్లగా యువరాజైన ఎడ్వర్డు అతన్ని లోనికి తీసుకుపోయి ఆదరిస్తాడు. ఒకరి జీవితం ఒకరు చూడాలనే ఆసక్తితో దుస్తులు మార్చుకుంటారు. ఎడ్వర్డు పేదదుస్తుల్లో బైటకురాగానే ప్రజలతన్ని పేదబాలుడుగానే భావిస్తారు. అతడు తను యువరాజునంటున్నకొద్దీ అవమానిస్తారు. అక్కడ యువరాజు వేషంలో ఉన్న టామ్‌ను ఎడ్వర్డే అని అంతా అనుకుంటారు. అతడు తను పేదవాడినని చెప్పినా వినరు. యువరాజుకే పిచ్చెక్కినట్లు భావిస్తారు. ఈలోగా వృద్ధరాజు హెన్రీ చనిపోవడం, యువరాజుగా చెలామణీ అయ్యే టామ్ రాజు కావడం జరుగుతుంది. అసలు రాజు ఎడ్వర్డును జాన్ కాంటీ తన కొడుకేనని భావించి బాధిస్తూ ఉంటాడు. అతని చేతుల్లోంచి ఎడ్వర్డును మైల్స్ హెండన్ అనే వీరయువకుడు రక్షిస్తాడు. హెండన్ తండ్రి కోపానికిగురై పదేళ్లకాలం విదేశాల్లో గడిపినవాడు. అతడు ఎడ్వర్డును అనేక అపాయాల్లోంచి తప్పించి తనతో స్వగ్రామం తీసుకుపోతాడు. అక్కడ హెండన్ తండ్రి చనిపోవడం, తమ్ముడు భార్యా ఆస్తికి సర్వాధికారై తిరిగివచ్చిన అన్నను దొంగ అని ఖైదులో వేయించడం జరుగుతుంది. జైలులో శిక్ష అనుభవించి హెండన్, ఎడ్వర్డులు తిరిగి లండన్ చేర్తారు. అక్కడ దురదృష్టవశాత్తు తిరిగి విడిపోతారు. టామ్ కాంటీకి పట్టాభిషేకం జరగబోతున్న సమయానికి సరిగ్గా ఎడ్వర్డు ఆ చోటికి చేరుకుంటాడు. అతన్ని రాజముద్ర సహాయంతో అసలు రాజుగా గుర్తించి అతనికే పట్టాభిషేకం చేస్తారు. ఇక చదవండి.

## 35

అనువాదం: శ్రీ నండూరి రామమోహనరావు

లండన్ వంతెనమీద జరిగిన కొట్లాటలో చిక్కుకుని మైల్స్ హెండన్ బాలరాజునుండి వేరైపోయినట్లు చూశాం. అప్పటికే అతనికి బట్టలు దుమ్ముకొట్టుకుని, జుట్టు రేగిపోయి ఎవరో ఆటవిక వ్యక్తిలాగా ఉన్నాడు గాని సాగరికుడివలె లేదు. కొట్లాటలోనుంచి ఇవతల పడేసరికి బట్టలు శుభ్రంగా చిరిగిపోయాయి; టోపీ ఎవడో

కొట్టేశాడు. జేబులోవున్న కాసిని డబ్బులుకూడా దొంగలు కత్తిరించేశారు.

హెండన్ ఇందు కేమీ చింత పడలేదు; బాలరాజు కనిపిస్తే అదే పదివే లనుకున్నాడు. అతడు సైనికుడు; ప్రతిదీ క్రమపద్ధతిలో చేసే అలవాటు ఉన్నవాడు. అందుచేత కంగారుపడి కాళ్లు తొక్కుకోకుండా తాపీగా ఆలోచించాడు.

బాలుడు ఎక్కడికి పోయి వుంటాడు? బహుశా తను పుట్టి పెరిగిన పూర్వస్థలానికి పోయిఉంటాడు. మతి స్థిరంలేని మనిషాయెను. అందులో నిరాశ్రయుడాయెను. కనుక అప్రయత్నంగానైనా తన పూర్వ గృహానికి వెళ్లిఉంటాడు. అయితే అతని పూర్వ నివాసమెక్కడ ఉండి ఉంటుంది? అతని పేలికలనుబట్టి, అతని తండ్రినని చెప్పుకున్న ఆ తాగుబోతుగాడి లక్షణాలను బట్టి, చూస్తే అలగాజనం ఉండే పేటల్లోనని ఊహించవచ్చును. సరే అటువంటి ప్రాంతాల్లోనే వెదుకుదామనుకో. వెంటనే కనిపిస్తాడని నమ్మకమేమిటి? అల్లాకాదు. బాలునికోసం వెదకడం కాలయాపన. గుంపుకోసం వెదకాలి. ఎక్కడ పదిమంది పోగడితే అక్కడల్లా అన్వేషించాలి. ఏగుంపులోనో ఒక గుంపులో బాలుడు తప్పకుండా కన్పిస్తాడు. ఎందుకంటే అతడు మామూలు ప్రకారం తనే రాజునని ఉపన్యాసాలు దంచుతూఉంటాడు. పనీ పాటాలేని జనం అతనిచుట్టూ జేరి రాళ్లురువ్వి, తిట్టి, కొట్టి, పురెక్కిస్తూ ఉంటారు. కనుక గుంపుల్లో అన్వేషించాలి. బాలుడు కనిపించగానే అవసరమైతే కొందర్ని నేలమట్టం చేసి, అతన్నెత్తుకుని నిరపాయ స్థలానికి ఉడాయించాలి. ఆ తరవాత ఇద్దరూ ఇక వేరుపడిపోకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. అదీ పథకం; చాలా బావుంది; వేలెత్తి చూపుదామన్నా ఇందులో లోటు కనిపించదు; మైల్స్ హెండన్ ఒక్క పథకం వేశాడూ అంటే దానికి తిరుగు ఉంటుందా? హా!

మన వీరయువకుడు అన్వేషణ ప్రారంభించాడు. ఆరాత్రి గంటల తరబడి, సందుల్లో గొందుల్లో వీధుల్లో బజార్లలో ఎన్ని మైళ్లు కాళ్లరిగిపోయేలా తిరిగాడో చెప్పలేం. కనిపించిన ప్రతిజనసమూహాన్ని, సమావేశాన్ని పరీక్షించాడు. ఎందరినో అడిగాడు. కాని అంతా వృథా, వృథా. బాలరాజు ఎక్కడా దొరకలేదు. చాలా ఆశ్చర్యమైంది మైల్స్ హెండన్‌కు. ఎందుకంటే అతడు తయారుచేసిన పథకం సామాన్యమైనది కాదు; నిర్దుష్టమైనది. అయినప్పటికి బాలరాజు కనిపించలేదంటే ఎంత ఆశ్చర్యం?

తెల్లవారింది. హెండన్ నీరసించాడు. నిద్రలేక కళ్లెర్రబడ్డాయి; తిండిలేక దవడలు పీక్కుపోయాయి. ఈ అన్వేషణ చాలా కాలం పట్టేట్లున్నదనీ, ముందు భోజనం ఆరగించి, కాస్త నడుంవాల్చి తరవాత వెదకడం మంచిదనీ భావించాడు. కాని భోజనం ఎక్కడనుంచి వస్తుంది? జేబులో పెన్నీలేదు. కులీనుడుగనుక అడుక్కుందామనే ఆలోచన తట్టనేలేదు. తన ఖడ్గం తాకట్టు పెడదామా అనుకున్నాడు గాని, ఆత్మగౌరవం అడ్డంవచ్చింది. పోనీ పైఅంగరఖా తాకట్టుపెడదామనుకున్నాడు; కాని ఊరికే ఇస్తానన్నా ఆపదార్థాన్ని ముట్టుకునే దౌర్భాగ్యుడు దొరుకుతాడని తోచలేదు.

మధ్యాహ్నమైనా మైల్స్ హెండన్ వీథుల్లో గ్రుమ్మరుతూనే వున్నాడు. రాజుగారి ఊరేగింపును చాలదూరం వెంబడించాడు. తన బాలమిత్రుణ్ణి ఈ ఊరేగింపు ఆకర్షించి తీరుతుందనీ, ఎక్కడో దొరికి తీరుతాడనీ అతని ఆశ. ఊరేగింపు వెస్టుమిన్‌స్టర్ చర్చితో ఆగిపోయింది. కాసేపు ఆప్రాంతంలోనే అటూ ఇటూ తచ్చాడాడు. తన మొదటి పథకం విఫలమైనందున మరోచక్కటి పథకం ఆలోచించాలని అనుకున్నాడు. అలా ఆలోచనల్లోపడి, చర్చినిదాటి చాలదూరం నడిచాడు. థేమ్సునదీ తీరానికి వచ్చాకగాని అతనికి తానెక్కడున్నదీ తెలియలేదు. అక్కడ ఆట్టే ఇళ్లు లేవు; పొద్దు వాటారుతున్నది. నీరసంతోను, నిరుత్సాహంతోను మనిషి క్రుంగిపోయాడు. చెట్లనీడల కాస్సేపు విశ్రాంతి తీసుకుందామని కూర్చున్నాడు. దూరాన్నుండి ఫిరంగులమోత అస్పష్టంగా వినవస్తోంది. "కొత్తరాజుకు పట్టాభిషేకం జరుగుతోంది" అనుకున్నాడు. అనుకుంటూనే నేలకొరిగి నిద్రపోయాడు. క్షణంలో వళ్లుస్వాధీనంతప్పిపోయి సుఖమయ నిద్రాలోకాల్లో విహరించసాగాడు.

ఆ నిద్రపోవడం, పోడం

మర్నాడు పొద్దున్న తొమ్మిది, పది గంటలవేళకుగాని మెలకువరాలేదు. మెలకువ వచ్చిందిగాని ఓపట్టాన లేవలేకపోయాడు. వళ్లు పచ్చిపుండై వుంది. బలవంతాన లేచి తూలుతూ, తూలుతూపోయి నదిలోదిగి కాళ్లు చేతులు, ముఖం ప్రక్షాళించుకున్నాడు. కడుపునిండా నీళ్లు తాగి క్షుద్బాధను ఉపశమింపజేశాడు. కాస్త సత్తువవచ్చింది ఇప్పటికి. మళ్లీ వచ్చినదారినే పట్టాడు. వెస్టుమిన్‌స్టర్ చేరుకోగానే అతనికి మహత్తరమైన ఆలోచన కలిగింది. ప్రథమ సమస్య ఆకలిగదా! అందుచేత తన తండ్రి మిత్రుడైన సర్ హంఫ్రీమార్లో నడిగి రెండు మూడు పిల్లింగులు బదులుతీసుకుని ఎంగిలి పడే ప్రయత్నంచెయ్యాలి. ఇక తరవాత నంటావా- ప్రస్తుతానికి ఇంత మటుకూ విజయవంతంగా కార్యం సాధిస్తే తరవాత సంగతి తరవాత చూసుకోవచ్చు. అవాంతర సమయాల్లో వర్తమానమే ముఖ్యంగాని భవిష్యత్తు ఏమైతే ఎవడిక్కావాలి?

వెస్టుమిన్‌స్టర్ కోట ప్రాకార ద్వారాలను చేరేసరికి పదకొండు గంటలయింది. సీతాకోకచిలకల వలె ఆకర్షణీయమైన అలంకారాలు చేసుకున్న ప్రభువులు, ఇతర అధికారులు కోటలోకి వస్తున్నారు, పోతున్నారు. వారిమధ్య మైల్స్ హెండన్ అవతారంకూడా ఆకర్షణీయంగానే ఉంది. అతని పేలికలు, వాలకం చూసి అధికారులు "వీడి కిక్కడేంపని" అన్నట్టు కొర కొర చూస్తున్నారు. తమ కక్కడికి ఏదో పనిఉన్నట్లు, తాము లేకపోతే రాజకీయ వ్యవహారాలన్నీ స్తంభించి పోతాయన్నట్లు హడావుడిగా తిరుగుతున్నారు.

మైల్స్ హెండన్ ఇన్ని ముఖాలలోనూ ఒక్క ముఖమేనా పరిచితమైనదిగాని, పరిచయాభిలాషతో ఉన్నదిగాని దొరుకుతుందేమోనని ఆశతో పరికిస్తున్నాడు. తనంతట తను కోటలోనికి వెళ్ల గలగడం అసంభవం; కనుక ఎవరేనా తన కబురు సర్ హంఫ్రీమార్లోకు అందజేస్తారేమోనని అతని ఆశ.

ఇంతలో రాజుగారి "దెబ్బలబ్బాయి" హంఫ్రీ మార్లో కోటలోనుండి ఈవలకు వచ్చి మైల్స్ హెండన్‌ను చూసి చటుక్కున ఆగాడు. వెనకనుంచి హెండన్‌ను పరీక్షగా ఎగాదిగా చూశాడు. "మహారాజు నగరమంతా వెదికిస్తున్న దేశద్రిమ్మరి ఇతడే అయ్యుండాలి. మహారాజువర్ణన ఇతనికి కచ్చితంగా సరిపోతోంది. ఆ బట్టలు, కత్తి, అతడు నుంచున్న భంగిమం అంతా అదే. అతడూ ఇతడూ వేరువేరు వ్యక్తులైతే-సృష్టికర్త తెలివి చట్టుబండలైనట్లే. మహారాజులాంటి మనిషి ఇంకోడున్నందుకే మేమంతా తబ్బిబ్బవుతూంటే, ఆయనగారు వెదికిస్తున్న మనిషిలాంటివాళ్లిద్దరుండటం ఇక నిజంగా మతిభ్రమ కలిగిస్తుంది; సృష్టికర్తకు రకరకాల మనుషుల్ని తయారుచెయ్యడం

చేతకాదనిపిస్తుంది. ఏమైనా ఏదో నెపంమీద ఇతన్ని పలకరించి ఎవరో తెల్సుకోవడం మంచిది."

ఈ లోగా మైల్స్ హెండన్ వెనక్కి తిరిగాడు. "దెబ్బలబ్బాయి" తనవంకే పరీక్షగా, కుతూహలంతో చూడ్డం గమనించాడు. ఈ అవకాశం పోనివ్వగూడదని ఒక్క అంగలో బాలకుని సమీపించి అడిగాడు.

"తమ్ముడూ! నువ్వు కోటలోనుంచి వచ్చినట్టున్నావ్? నువ్వు కోటలో వాడివేనా?"

"అవునండి సార్!" ('సార్' అని కొంచెం ఎగతాళిగానే అన్నాడు.)

"అయితే సర్ హంఫ్రీమార్లో గార్ని ఎరుగుదువా?"

"దెబ్బలబ్బాయి" ఉలిక్కిపడ్డాడు. "అరె! చచ్చిపోయిన మా నాన్నగారితో ఇతనికేంపని!" అని లోపల అనుకున్నాడు.

"ఎరుగుదునండి సార్!"

"ఎరుగుదువా? ఆయన లోపలున్నారా?"

"ఆ. ఉన్నారు," అని పైకి సమాధానమిచ్చి "భూగర్భంలో ఉన్నారు," అని లోపల అనుకున్నాడు హంఫ్రీ.

"చూడు, తమ్ముడూ! నిన్ను చూస్తే నాకు చాల ఇష్టం పుడుతోంది. మంచివాడివిగాని, ఒక్క చిన్నపని చేసిపెట్టాలి. సర్ హంఫ్రీ. దగ్గిరికి వెళ్లి నా పేరు చెప్పి, కొద్దిగా మాట్లాడాలనుకుంటున్నానట, రమ్మని చెప్పాలి. ఏం?"

"అల్లాగేనండి."

"అయితే, సర్ రిచర్డు కుమారుడు మైల్స్ హెండన్ కోటబయట వేచిఉన్నాడని చెప్పు. త్వరగా రావాలి తమ్ముడూ!"

హంఫ్రీ ఈ పేరు విని నిరుత్సాహపడ్డాడు. "రాజుగారు ఈ పేరు చెప్పలేదే. కాని ఫరవాలేదు. ఇతడు అతనికి కవలతమ్ముడై ఉంటాడు, రాజుగారు చెప్పిన 'సర్ గోచీపాతరాయుణ్ణి' గూర్చి ఇతనికేమైనా తెలిసి ఉండచ్చు" అని భావించాడు.

"అలాగేనండి. మీరు ఆగోడ పక్కననుంచోండి. ఇప్పుడే వస్తా," అని మైల్స్‌తో చెప్పి తను లోపలికి వెళ్లాడు.

హెండన్ గేటు పక్కన ప్రాకార కుడ్యానికి ఒక అరుగు ఉంటేదాని మీద కూర్చున్నాడు. ద్వారపాలకులు కాళ్లు నెప్పి పెడితే కూర్చునేస్థలమది. అతడు కూర్చున్నాడో లేదో, ఇంతలో ఒక అధికారి కొందరు సైనికులతో అటు పోతూ ఇతన్ని చూసి ఆగాడు. సైనికులను 'హాల్ట్' అని ఆజ్ఞాపించాడు. హెండన్‌ను దగ్గిరకి రమ్మని గద్దించాడు. అతడు దగ్గిరికి రాగానే, "కోటవద్ద అనుమానాస్పదంగా సంచరిస్తున్నావుగనుక బంధిస్తున్నా" నని చేతికి బేడీలు తగిలించాడు. హెండన్ దురదృష్టమేమోగాని మొదటినుండీ అతని వ్యవహారం బెడిసికొడుతూనేవుంది. హెండన్ తను ఫలానా పనిమీద వచ్చానని సంజాయిషీ ఇవ్వబోయాడు, కాని అధికారి "నోర్ముయ్, బద్మాష్!" అని గదమాయించాడు. అతన్ని నిరాయుధుణ్ణిచేసి సోదా చెయ్యమని సైనికులకాజ్ఞాపించాడు.



సైనికులు సోదా చేస్తుంటే హెండన్ నవ్వుకున్నాడు. "జేబుల్లో ఏమున్నా ఉంటే రెండు రోజుల్నించి పస్తుఉండాల్సిన గతేం పట్టిందినాకు? వెతుక్కోనీ. ఏమన్నా దొరికితేగా" అని తనలో అనుకున్నాడు.

జేబుల్లో ఒక పత్రం తప్ప మరేం కనబడలేదు. అధికారి దాన్ని చించి తెరిచాడు. అది ఆరోజున హెండన్ హాలులో బాలరాజు హెర్ట్‌ఫర్డు నుద్దేశించి రాసిన ఉత్తరం. మైల్స్ హెండన్ దానిసంగతే మరిచిపోయాడిన్నాళ్లూ. ఒకవేళ జ్ఞాపకం ఉన్నా, "ఆ పిచ్చివాడి పిచ్చిగీతల్ని లెక్కపెట్టేదేముందిలే," అని భావించాడు.

అధికారి ఉత్తరంలో ఇంగ్లీషు భాషలో రాయబడిన వాక్యాలు

బిగ్గరిగా చదివాడు. మైల్స్ హెండన్ వింటూనే తెల్ల మొగం వేశాడు. అధికారి ఇలా గన్నాడు:

“ఓరి వీడి తస్సాదియ్యా. రాజపదవికి ఇంకో హక్కుదారు బయల్దేరాడోయ్! డజన్లకొద్దీ పుట్టుకొస్తున్నారు హక్కుదార్లు. వీడెవడోగాని ఇంగ్లీషుచాలక లాటిన్, గ్రీకుల్లో కూడా దంచాడు ఉత్తరం. ఒరేయ్. ఈ ద్రోహిని కదలనివ్వకండి. నేను పోయి ఈ ఉత్తరం మహారాజుకు పంపిస్తాను.”

అధికారి కోటలోకి వెళ్లాడు. “నా దురదృష్టం ఇప్పటికి పరిపక్వమైంది. ఆ ఉత్తరం నా ప్రాణాలకే ముప్పు తెస్తుందనుకోలేదు. నాకు నాకు ఉరికంబం తప్పదు. పాపం నా చిన్నమిత్రు డేమవుతాడో? భగవంతుడే రక్షించాలతన్ని,” అని విచారవదనుడై తలపోస్తున్నాడు హెండన్.

అధికారి తిరిగివచ్చాడు. ఎలాగూ ఉరిశిక్ష తప్పనప్పుడు అధైర్యపడి లాభమేమిటని హెండన్ తన్నుతనే సమాధానపర్చుకున్నాడు. ధీరుని వలె తన దుర్గతి నెదుర్కోవాలని గుండె రాయిచేసుకున్నాడు. అధికారిబంధితుని వదలిపెట్టమని, అతని కత్తి నతని కిచ్చివేయమని భటుల కాజ్ఞాపించాడు. తర్వాత హెండన్‌కు వినయపురస్సరంగా నమస్కరించి, “సార్! నా వెంట రండి,” అన్నాడు.

అధికారి ప్రవర్తనలో ఈ మార్పుకు కారణ మేమిటో హెండన్ కర్థంకాలేదు. ఏడిపించాలని ఈవినయం అభినయిస్తున్నాడా అని అనుమానించాడు.

అధికారి ననుసరించి హెండన్ కోట అంతర్భాగానికి నడిచాడు. రాజభవనంవద్ద ఆగి తనపై అధికారికి హెండన్‌ను అప్పగించి మొదటి అధికారి వెనక్కి వెళ్లిపోయాడు.

రెండో అధికారి హెండన్‌కు మళ్లీ ప్రణమిల్లి లోపలికి తోడ్కొనిపోయాడు. ఒక విశాలమైన హాల్లో ప్రవేశించారు; అక్కడ గొప్పగొప్ప “బంట్రోతులు” బార్లుతీర్చి నిలబడి మాట్లాడుకుంటున్నారు. హెండన్‌ను చూసి అందరు సంభాషణ ఆపివేసి తలలువంచి గౌరవం ప్రకటించారు. అతడు ముందుకు వెళ్లగానే రుమాళ్లు నోటి కడ్డం పెట్టుకుని గుబులు గుబులుగా నవ్వుకున్నారు. ఈ “సర్ గోచీపాత రాయుడు”తో మహారాజు కేంపనో ఎవరికీ తెలియలేదు. హెండన్ వాళ్ల హేళనను లెక్కచెయ్యకుండా ఇంకా ముందుకు పోయాడు.

అది రాజుగారి దర్బారు మందిరం. ప్రభువులు, ఉన్నతాధికార్లు వరసగా నుంచున్నారు. హెండన్‌ను వెంటబెట్టుకువచ్చిన అధికారి అతన్ని మందిరమధ్యంలో వరకూ తీసుకువచ్చి, మరొకసారి ప్రణమిల్లి వెనక్కి వెనక్కినడిచి ఒకఫక్కగా నుంచున్నాడు.

మైల్స్ హెండన్ కంగారుపడుతూ సభ్యులవంక బిత్తరిచూపులు చూస్తున్నాడు. అతని కెదురుగా కొంతదూరంలో బాలరాజు మఖమల్ చాందినీలో సింహాసనాసీనుడై ఉన్నాడు; తల ఒకపక్కకు తిప్పి ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

తన జేబులో రాజద్రోహాకరమైన ఆ ఉత్తరం దొరికినందుకు తనకు ఉరిశిక్ష తప్పక విధింపబడుతుందని హెండన్ నిశ్చయించుకున్నాడు. బహుశా మహారాజే స్వయంగా తన్ను విచారణచేసి శిక్షవేస్తారని అనుకున్నాడు. నడియౌవనంలో ఉన్న తనకు ఇంత ఆకస్మికంగా, అవమానకరంగా మరణశిక్ష పడటం ఎంతదురదృష్టం! ఏ శిక్షపడినా త్వరగా తెమిలిస్తే బాగుండును - సీతాకోకచిలకల్లా కులుకుతున్న సభ్యుల్ని చూస్తుంటే అతనికి అరికాలి మంట నెత్తికెక్కుతోంది. ఒక్కొక్కణ్ణీ పట్టుకుని నమిలి పారెయ్యాలన్నంత కోపం కలుగుతున్నది.

ఇంతలో బాలరాజు తలఎత్తి ఇంకోవైపుకు తిరిగి ఇంకో అధికారితో ఏదో గుసగుసలాడుతున్నాడు. హెండన్‌కు బాలరాజు ముఖం స్పష్టంగా కనిపించింది. గుండె లాగి స్పృహ తప్పిపోయేంత పనైంది. బాలరాజును తదేకంగా చూస్తూ, “అరె! నా మిత్రుడు! ఇక్కడి కెలా వచ్చాడు? ఆ సింహాసన మెల్లా ఎక్కాడు? ఇది కలా? నిజమా?” అని విస్మయంతో కొయ్యబారిపోయాడు. తరవాత చుట్టూ

చూశాడు; కలకాదని తేల్చుకునేందుకు చేతిమీదగిల్లకుని చూశాడు; నెప్పిపెడుతూనేవుంది; "ఇది కల కాదు. నిజమే. ఈ ప్రభువులు, దర్బారు, నేను-నిజమే, నిజమే."

మళ్ళీ బాలరాజు వంక చూశాడు. "సందేహంలేదు. ఇతడు నాతో ఇన్నాళ్లూ తిరిగిన పిచ్చివాడే; నా స్నేహితుడే. అయితే ఇతడు బిచ్చగాడు, పిచ్చివాడు కాడా? నిజంగా ఇంగ్లండు సార్వభౌముడేనా? ఈసమస్య ఎలా తేల్తుంది? నా సందేహం ఎవరు తీరుస్తారు?"

మైల్స్‌హెండన్ మనస్సులో చక్కటి ఉపాయం మెరుపులా మెరిసింది. గోడవద్ద ఖాళీగా ఒక కుర్చీ ఉంది. అది తెచ్చి సింహాసనం ఎదురుగా వేసి ఠీవిగా కాలుమీద కాలు వేసుకుని కూర్చున్నాడు.

ఇది చూసి సభికులు క్రుద్ధులయ్యారు. ఒకడు అతన్ని సమీపించి, "నీకు బుద్ధిలేదుటోయ్! మహారాజుసన్నిధిలో కూర్చుంటావా?" అన్నాడు.

ఈ గందరగోళం బాలరాజు దృష్టి నాకర్షించింది. ఇంతవరకూ ఆయనకు హెండన్ వచ్చిన సంగతే తెలియదు. ఇప్పుడు మొదటిసారిగా అతన్ని చూశాడు. చెయ్యెత్తి ఆజ్ఞాపించాడు.

"అతన్నేం చెయ్యకండి. మహారాజుసన్నిధిలో కూర్చునే హక్కు అతని కున్నది."

సభికులు అప్రతిభులైపోయారు ఈమాటకు. బాలరాజు వారి సందేహాలను తీర్చాడు:

"సావధానంగా వినండి, సభికులారా! ఇతడు మైల్స్ హెండన్. నాకు ఇష్టుడైన, నమ్మినబంటు. నన్ను శరీరహానినుండి, బహుశా అకాలమరణంనుండి కూడా రక్షించాడు; అందుచేత ఇతడు 'సర్' బిరుదు పొందాడు. ఆపిమ్మట నన్ను కొరడాదెబ్బలనుండి, అవమానంనుండి రక్షించి గొప్ప త్యాగంచేశాడు; అందుకై ఇతన్ని కెంట్ పరగణాకు ప్రభువుగా చేస్తున్నాను; అతని హోదాకు తగిన ధనం, భూములు అతని కివ్వబడతాయి. అంతేకాదు, ఇంకావినండి. మహారాజసన్నిధిలో కూర్చునే హక్కును అతనికి నేనే ఇచ్చాను--అతడు, అతని తరవాత అతని వారసులు ఈ హక్కును వంశపారంపర్యంగా అనుభవిస్తారు. ఇంగ్లండు సింహాసనమున్నంత వరకూ ఈ హక్కు వారికి ఉంటుంది."

బాలరాజు ప్రసంగిస్తుండగా ఇద్దరు కొత్తవ్యక్తులు దర్బారు హాల్లోకి ప్రవేశించి ఒక ప్రక్కన నుంచుని వింటున్నారు. వారి ఆశ్చర్యం వర్ణనాతీతం. బాలరాజు వంక, మైల్స్‌హెండన్‌వంక అదేపనిగా చూస్తున్నారు. వారెవరో కాదు-మన కిదివరకే పరిచితులైన సర్ హ్యూహెండన్, ఎడిత్ సతి. వారు పట్టాభిషేకానికి హాజరు కావాలని బయలుదేరినా కారణాంతరాలవల్ల ఆలస్యంగా వచ్చారు. మైల్స్‌గాని, బాలరాజుగాని వారినింకా చూడలేదు. మైల్స్‌కిప్పటికి నమ్మకం కలిగింది తనతో తిరిగిన బాలుడు మహారాజేనని. కాని ఆశ్చర్యం ఇంకా తగ్గలేదు.

ఎంత వింత! ఎంత అద్భుతం! నాతో అన్నిరోజులు తిరిగినా ఇతన్ని పిచ్చివాడుగా, బిచ్చగాడుగాకట్టి ఎంత మోసపోయాను. నాకంటె బుద్ధిహీను డెవడన్నా ఉంటాడా? ఒక దేశపు మహారాజుకు వైభవమంటే ఏమిటో చూపించబోయాను. మాఇంట్లో డభ్భయ్ గదులున్నాయనీ, ఇరవై ఏడుగురు నౌకర్లున్నారనీ గొప్పలు చెప్ప

(42-వ పేజీ చూడండి)

# పీనాసి పుల్లయ్య

నగనగనగా ఒక వూళ్లో పుల్లయ్యఅనే ఒక పెద్ద ధనవంతుడు ఉన్నాడు. ఆయనకు సమస్త భాగ్యాలూ వున్నాయి. కాని మహా పిసినిగొట్టు. ఎప్పుడూ ఎవ్వరికీ, ఒక్కగింజయినా బిచ్చం పెట్టి ఎరగడు. ఎవరైనా వాకిటి ముందు బిచ్చానికివచ్చి నిలబడితే, తిట్టుకుంటూ కర్ర దీసుకొని వెంటబడేవాడు పీనాసి తనానికి పేరు వహించాడు. ఎవరైనా వచ్చి చందాలుకోరితే ప్రాణం తీసినంత పనయ్యేది పుల్లయ్యకు. తన జీవితంలో ఒక్కకాని డబ్బు ధర్మంజేసి యెరుగని పుల్లయ్యకు మరి యెవరైనావచ్చి డబ్బు అడిగితే బాధ కాదూ? అడిగితేతనప్రాణమయినా యిస్తానంటాడుగాని డబ్బు మాత్రం అడగవద్దంటాడు. 'నా ప్రాణంకంటె యెక్కువగా భావించి సంపాదించినడబ్బు నీ కెట్లా యిస్తానయ్యా?' అని సమాధానం చెప్పేవాడు. అందుకని యెవ్వరూ పుల్లయ్య యింటికివచ్చి యాచించరు.

పుల్లయ్య రోజూ నియమం తప్పకుండా కొన్ని పనులు చేసేవాడు. ఉదయమూ సాయంత్రమూ స్నానంజేసి ధనలక్ష్మిని పూజించేవాడు. పూజ పూర్తయిన తరువాత యినప్పెట్టెలోని డబ్బంతా లెక్కపెట్టి సరిచూచుకొనేవాడు. ఇదీ నిత్యమూ ఆయనచేసేపని. ఆ పెట్టె దగ్గరే తన మంచం వేసుకొని యెప్పుడూ దానికి కాపలాగాస్తూ వుంటాడు. ఒక్కమాటలో చెప్పాలంటే ఆ యినప పెట్టెను వదలి ఒక్కనిముషమైనా వుండేవాడు కాడు. డబ్బే తన ప్రాణమని భావించేవాడు. రోజూ వాళ్లూవీళ్లూ వచ్చి డబ్బు యివ్వమని అడుగుతూంటే ఆ బాధనుంచి బైటపడడానికి ఆలోచిచేవాడు. తన దగ్గరున్న డబ్బంతా ఎవరకీ కనపడని ప్రదేశంలో దాచేస్తే యీ పిశాచాల బాధ వదులుతుందనుకొన్నాడు. కాని ఎవరైనా దొంగలు దాన్ని కాజేస్తే ఏం చేయ్యాలి? దొంగలకుకూడ కనబడని అలాంటి ప్రదేశ మేముంటుంది? ఈ ఆలోచనలతో పుల్లయ్య మహాబెంగబెట్టుకొన్నాడు.

ఇలా వుండగా కొంతకాలానికి ఆదేశంలో కరువు వచ్చిది. ఆ సంవత్సరం పంటలేమీ పండలేదు. ఎవరికీ సరిపడిన ధాన్యం లేదు. దూర ప్రాంతాలనుంచి ఎక్కువ ధరలుపెట్టి ధాన్యంకొని తెచ్చుకోవాలి. మన పీనాసి పుల్లయ్యకు కూడా సరిపడ ధాన్యంలేదు. ధాన్యం యింట్లోడబ్బు ఖర్చుపెట్టికొనాల్సివచ్చింది. కాని పుల్లయకు డబ్బు ఖర్చు పెట్టడమంటే ప్రాణముమీదికొచ్చింది. ఇంత కాలంనుంచి ఎంతో ప్రేమతో కూడబెట్టిన ధనమంతా యిప్పుడు యీ వెధవ శరీరాలకై ఖర్చుపెట్టడమా? అనే ఆలోచన కలిగింది. ఏమైనా సరే ఖర్చు పెట్టకూడదనుకొన్నాడు.

తిండిలేక భార్యాపిల్లలు అల్లాడిపోతున్నారు. కృశించి పోతున్నారు. అయినా పుల్లయ్య మనస్సులో మార్పు రాలేదు. ఒకొక్కరుగా, భార్యా పిల్లలందరూ ఆకలిబాధకు బలి అయిపోతున్నారు. ఆదృశ్యాన్ని చూచిన కొందరు పెద్దమనుష్యులు వచ్చి "పుల్లయ్యా! నీకు యింత డబ్బుంది గదా? భార్యాపిల్లలూ, యిలా ఆకలితో చస్తుంటే చూస్తూ వూరకుంటే లాభమేమిటి? అందరూ పోయాక యింకా నీ డబ్బు నేం జేస్తావు? యిప్పడయినా తొందరపడి ఆహార ధాన్యంకొను" అని సలహా చెప్పారు. వారిసలహాలు మన పుల్లయ్యకు నచ్చలేదు. వారితో "మీకు అందరకీ తెలుసు గదా? నాకు డబ్బే

ప్రధానం అని. అలాంటప్పుడు యిప్పుడు ఖర్చుపెట్టమని సలహా యివ్వడం మీకు భావ్యంకాదు." అని సమాధానం చెప్పాడు పుల్లయ్య.

భార్యా, పిల్లలూ గతించిపోయారు. తానుకూడా అవసాన దశకు వచ్చేశాడు. తన కడుపుకు మాత్రం యెలా ఖర్చుచేయగల్గుతాడు? ఏధనంకోసమైతే భార్యాపిల్లలనుకూడా చావడానికి అంగీకరించాడో, యిప్పుడు దానిని తన ప్రాణంకోసం అయినా ఖర్చుపెట్టడానికి పుల్లయ్య మనస్సు అంగీకరించలేదు. కనీసం నీవు సంపాదించిన డబ్బుకోసం అయినా జీవాన్ని నిలబెట్టుకోమని యెవరైనా సలహా చెప్పితే అది వెగటుగా తోచింది పుల్లయ్యకు.

ఇప్పుడు పుల్లయ్య మనస్సులో ఒక భయం ప్రవేశించింది. రోజూ ఎవరో ఒకరు ఇలాగే చెపుతూవుంటే మనస్సు మారి డబ్బు ఖర్చు పెడతానేమో? లేకపోతే యిట్లాగేయింకా కరువుగా వుంటే, కడుపుమాడిన వాళ్లెవరైనా వచ్చి దోచుకొంటారేమో? ఇవి రెండూ గాకపోతే తాను చచ్చిపోయిన తరువాత యిదంతా యెవరైనా అపహరించుతారేమో? ఈ విచారాలన్నీ పుల్లయ్య మనస్సును బాధించసాగినాయి. కాబట్టి డబ్బంతా, యెవరికీ చొరరాని ప్రదేశంలో దాచేస్తే భద్రంగా వుంటుందనుకొన్నాడు. నడిసముద్రంలో అడుగున పడవేస్తే యిక యెవరికీసాధ్యం కాదనుకొన్నాడు. అయితే తను డబ్బునువదిలిపెట్టివుండడం యెలాగు? అందుకని తానుగూడా ఆ డబ్బుతోపాటు అక్కడే వుండాలని నిశ్చయించుకొన్నాడు.

డబ్బూ, బంగారమూ, అంతా తీసి నడుముకు బాగా బిగించి కట్టేశాడు. ఎవరికంటా బడకుండా సముద్రపు రేవుకు చేరుకొన్నాడు. అయితే నడి సముద్రములోనికివెళ్లేదెలాగు? అక్కడేవున్న ఒక నావికుణ్ణి పిలిచాడు. మధ్యలోకి వెళ్లడం సాధ్యంకాదు గనుక, నావమీద

(47-వ పేజీ చూడండి)



# రాజూ - పేదా

(39-వ పేజీ తరువాయి)

కున్నాను. ఇతన్ని పెంచుకుని, విద్యాబుద్ధులు నేర్పిద్దామనుకున్నాను," అని తనలోతను కుసిల్లిపోయాడు మైల్స్.

వెంటనే కర్తవ్యం జ్ఞాపకం వచ్చింది మైల్స్‌కు. కుర్చీమీద నుండి లేచి బాలరాజుకు మోకరించి, తనకు భూములు, బిరుదులు బహూమానించినందుకు కృతజ్ఞతను, యావజ్జీవ విధేయతను ప్రకటించాడు. లేచి ఒకప్రక్కన వినయవినమితుడై నిలబడ్డాడు. అతని పేలికలుచూసి ఇందాక హేళనగా నవ్వినవారు ఇప్పుడతని ఆకస్మిక భాగ్యానికి ఈర్ష్య చెందుతున్నారు.

బాలరాజు అప్పటికిగాని సర్ హ్యూను చూడలేదు. క్రోధాగ్నులు ప్రజ్వలించే కళ్లతో, అతని వంక వేలెత్తి చూపిస్తూ అన్నాడు:

"అతడు దొంగ. తనవికాని భూములను, హక్కులను అన్యాయంగా అనుభవిస్తున్నాడు. అవన్నీ లాక్కొని అతన్ని బంధించి కారాగారంలో తొయ్యండి. అతని సంగతి తరవాత చూస్తాను."

మాజీ సర్ హ్యూను రాజభటులు బంధించి తీసుకుపోయారు.

దర్బారు హాల్లో అవతలచివర సందడి చెలరేగింది. సభ్యులు పక్కకు తొలిగి టామ్‌కాంటీకి దారిఇచ్చారు. ఒకసేవకుడు అతనికి దారిచూపుతూ ముందు నడుస్తుండగా, విలువైనవింత బట్టలు ధరించి టామ్ ముందుకు వచ్చాడు; మోకరించి నిలబడ్డాడు.

బాలరాజు ప్రసన్న ముఖుడై అన్నాడు:

"టామ్! నేను లేని కొద్ది వారాల్లోనూ నువ్వు రాజ్యం పాలించిన విధానమంతా విన్నాను. చాలా సంతోషమైంది నీ సౌజన్యం, దాక్షిణ్యభావం ప్రశంసనీయాలు. నీతల్లి, అక్కలు మళ్ళీకనిపించారా? మంచిది - వాళ్ల పోషణకు తగిన ఏర్పాట్లు చేస్తాను. హంతకుడైన నీ తండ్రిని, నువ్వు కోరిన పక్షంలో న్యాయచట్టం అంగీకరించినట్టయితే ఉరితీయిస్తాను. సభికులారా! వినండి —ఈరోజునుండి క్రైస్తు చర్చిలోని అనాధ శిశువులకు భోజన నివాస సదుపాయాలే కాకుండా, విద్యాసంస్కారం కూడా కలిగేట్లు యేర్పాటు చేయవలసిఉంటుంది. ఈబాలుని దానికి ముఖ్యాధికారిగా నియమిస్తున్నాను. ఇతడు కొంత కాలం రాజపదవిని నిర్వహించాడు. కనుక ఇతడు సామాన్యులకంటె భిన్నంగా ఉండాలి. అందుకుగాను- ఇదుగో, ఇప్పుడితడు ధరించిన మాదిరి దుస్తులే ఇతడెప్పుడూ ధరిస్తాడు; ఆ మాదిరి దుస్తులను ఈరాజ్యంలో ఇంకెవ్వరూ ధరించరాదు. అతన్ని రాజ్యంలో యావన్మందీ వందనపురస్సరంగా గౌరవించాలి. అతనికి నేను రక్షణ ఇస్తున్నాను; "రాజమిత్రుడు" అనే గౌరవబిరుదం అతని కనుగ్రహిస్తున్నాను."

టామ్ ఉప్పొంగిపోతూ లేచి బాలరాజు హస్తాన్ని ముద్దుపెట్టుకున్నాడు. సేవక పరివేష్టితుడై అవతలికి వెళ్లిపోయాడు. ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా తల్లికి, అక్కలకు తన అదృష్టవార్తను వినిపించడానికి పరిగెత్తాడు.

## 36

చెరసాలలో బంధింపబడిన హ్యూ హెండన్‌ను ప్రశ్నించగా అతనంతట అతనే మైల్స్ అనుమానాలు నివృత్తి చేశాడు. ఆ రోజున ఎడిత్ హెండన్ హాలులో మైల్స్‌ను ఎరగననడానికి కారణమిది: మైల్స్‌ను మైల్స్‌కాదనక పోయినట్లయితే చంపేస్తానని హ్యూ బెదిరించాడు; ఆమె తన ప్రాణమంటే తన కేమాత్రం తీపిలేదని, నిరభ్యంతరంగా చంపివెయ్యొచ్చునని, కంఠంలో ప్రాణముండగా మైల్స్‌ను నిరాకరించబోననీ ఖండితంగా చెప్పింది; అప్పుడు ఎడిత్ తను చెప్పినట్లు నడవకపోతే మైల్స్‌నే చంపేస్తానని వాగ్దానం చేశాడు హ్యూ; దీంతో పాపమామె నిస్సహాయుడైన మైల్స్‌ను రక్షించడానికై అతన్ని ఎరగనని బొంకవలసివచ్చింది.

హ్యూను మహారాజు శిక్షించలేదు; అతని భార్య, అన్న అతనిపై నేరారోపణ చెయ్యడానికి నిరాకరించారు. వారిద్దరి ఉదారబుద్ధి వల్ల హ్యూ విడుదల అయ్యాడు. తిరిగి అన్నముఖంగాని, భార్యముఖంగాని చూడలేక దేశం విడిచి యూరప్‌లో ఏదో దేశానికి ప్రవాసియై వెళ్లిపోయాడు. అక్కడ పశ్చాత్తాపంతో బాధపడి, బాధపడి కొద్దికాలంలోనే మరణించాడు. తరవాత మరికొన్నాళ్లకు కెంట్ ప్రభువైన మైల్స్ హెండన్ వితంతువైన

ఎడిత్‌ను పెళ్లి చేసుకున్నాడు. ఇద్దరు మొదటిసారిగా తమ పురాతన గృహమైన హెండన్ హాలుకు విచ్చేసినప్పుడు పరగణా ప్రజలందరూ క్రూరుడైన హ్యూగ్ పరిపాలననుండి విముక్తి పొందినందుకు, సజ్జనుడైన మైల్స్ ప్రభువు పరిపాలకుడైనందుకు ఉత్సవాలు, వేడుకలు జరుపుకున్నారు.

టామ్ తండ్రియైన జాన్ కాంటీ ఐపు, ఆనమాలు లేకుండా మాయమైపోయాడు. మళ్ళీ అతని ఆచూకీ తెలియలేదు.

బాహాటంగా అమ్మబడి, దొంగల ముఠాలో సభ్యుడుగా చేరిన రైతును ఆరోజున హ్యూగో నుండి తన్ను రక్షించినందుకు కృతజ్ఞతగా బాలరాజు వెదికిపట్టుకుని శుభ్రమైన ఉద్యోగమిచ్చి సన్మార్గుణ్ణి చేశాడు.

వృద్ధుడైన లాయర్‌ను కూడా జైలునుండి విడిపించి, అతని జరిమానాలను రద్దుచేశాడు. ప్రాణాలతో మంటల్లో కాల్చబడిన ఇద్దరు 'బాప్టిస్టు' స్త్రీల కుమార్తెలను పిలిపించి వారికి పోషణసౌకర్యాలు కలిగించాడు. మైల్స్ హెండన్‌ను గుదిబండలో పెట్టి, కొరడా దెబ్బలు కొట్టించిన అధికారిని కఠినంగా శిక్షించాడు.

ఎవరిదో తెలియని కోడిపెట్టను తీసుకున్నందుకు ఉరిశిక్షకు పాల్పడిన బాలుణ్ణి, సాలివానినుండి చిన్న గుడ్డముక్కను దొంగిలించిన స్త్రీని బాలరాజు విడిపింపజేశాడు. రాజుగారి అడవిలో లేడికూనను చంపాడనే అసత్య నేరానికి శిక్ష విధింపబడిన వ్యక్తిని మాత్రం సమయానికి రక్షించలేక పోయాడు.

తనమీద పందిపిల్లను దొంగిలించాడనే నేరం మోపబడినప్పుడు కనికరం చూపించిన జడ్జిని బాలరాజు సమ్మానించాడు.

ఎడ్వర్డు తాను బ్రతికి ఉన్నంత కాలము తన అనుభవాలను మరిచిపోలేదు. ఆస్థాన సభ్యులతో ఇష్టాగోష్ఠి జరుపుతున్నప్పుడు, ఆరాత్రి తాను ద్వారపాలకుల చేతుల్లో దెబ్బలు తిన్నప్పటినుండి, జరిగిన వృత్తాంతాన్నంతటిని అతి కుతూహలంతో వర్ణించేవాడు. పట్టాభిషేకానికి ముందు రాత్రి తాను మైల్స్ హెండన్‌తో లండన్ చేరుకోవడం, వేరుపడి పోగానే తాను సరాసరి వెస్టుమిన్‌స్టర్‌కు పోయి అలంకారాలు చేస్తున్న కార్మికులతో కలిసి చర్చిలో ప్రవేశించడం, ఒక రహస్య స్థలంలో దాక్కుని నిద్రపోవడం, అదృష్టవశాత్తు కిరీటధారణసమయానికి మెలకువవచ్చి పట్టాభిషేకసభలోకి మెల్లిగా జొరబడడం-అంతా చమత్కారంగా వివరించేవాడు. తన విచిత్రానుభవాలను, పడిన కష్టాలను నిరంతరం జ్ఞాపక ముంచుకోవడంవలన, తన హృదయం మార్దవాన్ని కోల్పోదనీ, ప్రజల కష్టసుఖాలను సానుభూతితో అర్థం

చేసుకోగల శక్తి వస్తుందనీ అనేవాడు.

చివరివరకూ బాలరాజు మైల్స్ హెండన్, టామ్ కాంటీలను తన ఆప్తవర్గంలో ముఖ్యులనుగా ప్రేమించాడు. ఎడ్వర్డు చనిపోయినప్పుడు వారిద్దరి దుఃఖం చెప్పడానికి వీల్లేదు. కెంట్ ప్రభువు తనకు ఎడ్వర్డు ప్రసాదించిన హక్కును ఎప్పుడూ దుర్వినియోగం చెయ్యలేదు. ఎడ్వర్డు అనంతరం రెండుసార్లు మాత్రమే దాన్నతడు ఉపయోగించాడు; మేరీరాణి పట్టాభిషేకంలోను ఎలిజబెత్ పట్టాభిషేకంలోను మాత్రమే అతడు సింహాసనం ఎదుట కుర్చీవేసుకుని కాస్సేపు కూర్చున్నాడు. అతని తరవాత అతనికుమారుడు మొదటి జేమ్సు రాజ్యానికి వచ్చినప్పుడు మళ్ళీ అలాగే కూర్చున్నాడు. ఆ కుమారుని కుమారుడు మొదటి ఛార్లెసు పట్టాభిషేక సమయంలో తన హక్కును ఉపయోగించుకొనవచ్చేసరికి కెంట్ ప్రభువుల కలాంటి హక్కున్నదని పలువురికి జ్ఞాపకమే లేదు. అందుచేత అతగాడు రాజుగారిఎదుట కూర్చోబోగా మొదటిసారి మైల్స్ హెండన్ కూర్చున్నప్పుడు జరిగినంత రభస జరిగింది.



అయితే వృద్ధులు కొందరు అసలు విషయం వివరించి సభికులను శాంతపరిచారు. మైల్స్ హెండన్ వంశంలో ఆఖరివాడు కామన్వెల్తు యుద్ధాల్లో మహారాజపక్షాన పోరాడుతూ చనిపోయాడు. దాంతో ఆహక్కు కూడా అంతరించింది.

టామ్ కాంటీ ఎడ్వర్డు తర్వాత చ్చాలా కాలం వృద్ధాప్యం వచ్చేవరకూ బ్రతికివున్నాడు. ఆ వృద్ధుడు నెరిసిన తలతో, ఒకానొకప్పటి గంభీర రాజఠీవితో, వార్ధక్యంలో కూడా చెక్కుచెదరని అందంతో కనబడితే ప్రజలు ఎడ్వర్డురాజు బ్రతికివుంటే ఇలాగే ఉండేవాడు గదా అని అనుకునేవారు. అతన్ని ప్రజలు విశేషంగా గౌరవించేవారు. అతడు ధరించే ప్రత్యేక వస్త్రాలు చూసి, "ఆయనకాలంలో ఆయనా ఒకరాజే" అనుకునేవారు. అతడు వచ్చేదారిలో ప్రజలు గౌరవపూర్వకంగా తొలగి "టోపీలు తీసెయ్యండి. రాజమిత్రులు వస్తున్నారు." అని హెచ్చరించుకుంటూ సెల్యూట్ చేసేవారు. అతడామాటలు విని కారుణ్యంతో నిండిన మందహాసం చేసేవాడు. ఆయన హృదయంలోని మంచితనమంతా ఆ ఒక్క చిరునవ్వులో ప్రతిఫలిస్తోందని ప్రజలు అనుకునేవారు.

అవును. ఆరవ ఎడ్వర్డు పట్టాభిషేకం తరవాత ఆరేళ్లకాలమే రాజ్యంచేశాడు; కాని స్వల్పకాలమైతే నేం - అందరిచేతా మంచివాడనిపించుకుని పోయాడు. అతడు న్యాయవిచారణ చేసేటప్పుడు ఏ అధికారైనా "మహారాజా! మీరు మితిమీరిన దయచూపిస్తున్నారు. ఇలాగైతే ప్రజలకు అలుసుకాదా! నేరాలు ఎక్కువ కావా?" అని సలహా ఇవ్వబోతే-

"నువ్వు ధనరాసుల్లో పొర్లాడేవాడివి. దుఃఖం, అన్యాయం, కన్నీళ్లు ఎంత తీవ్రమైనవో నీ కేం తెలుసు? నాకూ నా ప్రజలకూ తెలుసు. నీకా? ఎంత ప్రయత్నించినా నీ కవి అర్థంకావు," అని గద్గద వాక్కులతో, చెమ్మగిలిన కళ్లతో మందలించేవాడు.

ఆనాటికీ ఈనాటికీ చాలా తేడావుంది. ఈ రోజుల్లో మనం ఏవి అక్రమాలనీ, అన్యాయాలనీ అనుకుంటున్నామో అవి ఆ రోజుల్లో శాస్త్రసమ్మతాలైన మామూలు విషయాలు. కనుక ఆకాలాన్ని బట్టి చూస్తే ఆరవ ఎడ్వర్డుపరిపాలన చాలా దయావంతమైనదనే చెప్పాలి. బాలరాజుకు వీడ్కోలివ్వబోతున్న ఈ సమయంలో ఈ విషయం జ్ఞాపకం పెట్టుకుందాం.

(అయిపోయింది)



మార్క్ ట్వేన్.

## గ్రంథసమీక్ష :

### "చెదిరిన ప్రతిబింబాలు"

కన్నవి, విన్నవీ కథలు, మొదటి భాగం, రెండవభాగం (వెల ఒక్కొక్కటి 1-8-0) మొక్కుబడి.

నాటికల సంపుటి (వెల 2-0-0)

రచయిత: మొక్కపాటి నరసింహశాస్త్రి; దొరకుచోటు: మొక్కపాటి వారు, అడ్మిరాలిటి హౌసు, మైలాపూరు, మద్రాసు 4.

శాస్త్రిగారు హాస్యరచయితగా పేరు పొందారు. అప్పుడప్పుడు వ్రాసిన కథలను, నాటికలను పై మూడు సంపుటాలుగా ఇటీవలే ప్రచురించారు. వర్తమాన సాంఘిక జీవితాన్ని ప్రతిబింబించడం ఆశయంగా పెట్టుకున్నట్లు రచయిత ఒకచోట చెప్పుకున్నారు. రచనలను పరిశీలించిన తర్వాత ఈ ఆశయం విజయవంతంగా భగ్నంచెయ్యబడినట్లు పాఠకునికి తోస్తుంది.

'న్యాయం' అనే కథలో ఒక రిక్షావాణ్ణి ఒక పాశ్చాత్యుడు హత్య చేస్తాడు; దానికి ఫలితంగా ఆ పాశ్చాత్యుడు కారులోనుండి పడి ఆకస్మిక మరణం పొందుతాడు; కోర్టువారు హంతకుణ్ణి శిక్షించలేకపోయినా, భగవంతుడు శిక్షించక మానడని కథా సారాంశం. 'జగన్నాథుని రథం' అనే కథలో హత్యానేరానికి ఒక నిర్దోషి ఉరి తీయబడతాడు. అతన్ని రక్షించలేకపోయానే అనే బెంగతో అతనిమీద ఏమాత్రం సానుభూతి లేని మరొకడు ఆత్మహత్యచేసుకుంటాడు. ఈ ఆత్మహత్యాంశం కథకే విధంగా అవసరమో, దాని ప్రయోజనమేమిటో తెలియదు. 'బండ సుబ్బడు' అనే కథలో శరీరస్థౌల్యం తగ్గించుకోడానికై ఒకడు బైరాగి చిట్కా వాడతాడు; దాని మహత్తువల్ల అతడు గడ్డిపోచలాగా అయిపోయి గాలిలోకి తేలిపోతాడు. శాస్త్రిగారి హాస్యం నవ్వు పుట్టించడానికై అతిశయోక్తులపైనే ఎక్కువగా ఆధారపడుతుంది. కాని ఈ కథలో అతిశయోక్తి మోతాదు మించిపోయినట్టు తోస్తుంది.

ఇక నాటికల్లో "మొక్కుబడి" అనేది వాస్తవికతకు యోజనాల దూరంలో ఉంది. ఒక యువతికి తిరుపతి వెంకటేశ్వరుల మొక్కు ఉంటుంది; ఆమె భర్త ఆధునికుడు గనుక మొక్కుకు వ్యతిరేకిస్తాడు; యువతికి జబ్బుచేసి ఏ మందుకీ నయం కాదు; అప్పుడు భర్త మొక్కు చెల్లిస్తామని అంటాడు; జబ్బు నిమిషాలమీద తగ్గిపోతుంది. ఈ అభూతకల్పన జీవితాన్ని ప్రతిబింబించడం కాదు; ఒక మూఢవిశ్వాసాన్ని బలపరచడమే. 'అభ్యుదయం' నాటిక క మన వాతావరణానికి చెందనిది. అది అమెరికావంటి దేశాల్లో జరిగినట్టు వ్రాస్తే ఉచితంగా ఉండేది.

సాంఘిక దురాచారాలు, అన్యాయాలు "మానవకల్పితము"లని, వాటిని "లేకుండా చేసుకునే శక్తి మనకున్న"దనీ శాస్త్రిగారు తుది పలుకులో ఒకచోట అన్నారు. కాని రచనలను పరిశీలిస్తే ఈ అభిప్రాయం ఎక్కడా వెల్లడికాదు. రచయితకు దైవవిధిలో కల నమ్మకంమాత్రం ప్రతి రచనలోను కనిపిస్తుంది. జీవితమంతా భగవంతుని చిద్విలాసమే అయితే ఏ అన్యాయానికి ఎవర్ని నిందించాలో, అసలు ఏది అన్యాయమో, ఏది కాదో తెలియని పరిస్థితి ఏర్పడుతుంది.

మామూలు మనిషికి అనుభవంలోకి రాని మరొక చిత్రమేమిటంటే ఈ రచనల్లో వ్యక్తులకు రాబోయే అపాయాలను, ఇతర సంఘటనలను అంతరాత్మ ముందుగానే చెబుతుంది.

నాటికల్లో "పెద్ద మామయ్య", కథల్లో "గాజుపాలెం గాంధి" రెండిటికీ వస్తువు ఒకటే. శాస్త్రిగారు ఒకదాన్ని ఉపసంహరిస్తే బాగుండేది.

### "సెక్సులో ఎక్స్ కర్థం"

శిథిల సంధ్య (పెద్దకథ) రచయిత: రావూరి భరద్వాజ; వెల1-0-0; దొరికేచోటు: మందారా, నెల్లూరు.

రమణ కథానాయిక; నాగభూషణం నాయకుడు. రమణ భర్తవద్ద బాకీ వసూలు చేసుకోడానికి వచ్చి "నాకు కావలసింది డబ్బు" అంటున్న నాగభూషణాన్ని రమణ చూసీచూడగానే గాఢంగా ప్రేమిస్తుంది. భర్తనీ, బంధువులనీ, గౌరవాన్ని త్యజించి అతనితో లేచిపోతుంది. తిండికి గడవని పరిస్థితిలో ధనికుడైన నాగభూషణం తండ్రి కామానికి లోబడుతుంది. తన ప్రియురాలితో వ్యభిచరిస్తున్నది తన తండ్రేనని తెలియక, ఆమె తనకు ద్రోహం చేసిందని నాగభూషణం ఆమెను వెళ్లగొడతాడు. "నీ పోషణకోసమే నీ తండ్రికి ఒప్పుకున్నా"నని ఆమె చెప్పినా నమ్మక అతడు సంబంధం తెంచుకుంటాడు. కాని ఆమెకుమాత్రం అతనిపై ప్రేమ అలాగే నిలిచిపోతుంది. ఇది ఇతివృత్తం.

సెక్సు రచయితలు దంపతుల మధ్య నిజమైన ప్రేమ ఉండటానికి వీలుందని సాధారణంగా ఒప్పుకోరు. సంఘ నియమాలను అతిక్రమించిన ప్రేయసీ ప్రియుల్లోనే అది సాధ్యమంటారు. ఈ కథలో రమణకు తన భర్తపై వైముఖ్యానికి కారణమేమిటో రచయిత ఎక్కడా చెప్పడు. బాకీ తీర్చకపోతే ఇల్లు వేలం వేయిస్తానని అనగలిగిన నాగభూషణాన్ని రమణ ప్రథమ వీక్షణంలోనే ఎలా గాఢంగా ప్రేమించగలిగిందో మనకు తెలియదు. భర్త ఆమెను వ్యక్తిగా గౌరవించక స్వంతవస్తువుగా వాడుకోవడం ఆమె విముఖతకు కారణం కావచ్చు. కాని

(48-వ పేజీ చూడండి)

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(80-వ పేజీ తరువాయి)

నీ కరువు పెట్టమని నేను చెప్పడంలేదు. ఇటువంటి వేవీ బయటపెట్టకుండా జాగ్రత్తపడమని మాత్రం చెప్తున్నాను."

"అయితే నా స్థితికి తగినట్లు..."

"నీ తండ్రి మంచి ఉదారబుద్ధికలవాడు. నీకు ధనానికి లోటుండదు. నువ్వు పారిస్‌లో ఉన్నంతకాలం సాలుకి 50 వేల ఫ్రాంకులు నీ కిస్తాడు."

"అలా అయితే నేను శాశ్వతంగా పారిస్‌లోనే ఉండిపోతాను."

"తొందరపడకు. పరిస్థితులు ఎప్పుడూ అనుకూలంగా ఉంటాయనుకోకూడదు. మనిషొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడు."

"నా తండ్రి పారిస్‌లో ఎంతకాలం ఉంటారు?"

"ఆట్టే రోజు లుండరు. రెండుమూడు వారాలుంటారేమో."

త్వరలోనే వెళ్ళిపోతాడని వినేసరికి ఆంద్రీకి తలపైనుంచి పెద్ద బరువు తీసేసినట్లయింది.

మాంట్ క్రిస్టో ఇలా అన్నాడు: "సరే. ఇంక నువ్వు నీ తండ్రిని చూడదల్చుకుంటే, సావడిలోకి వెళ్ళు. ఆయన అక్కడున్నారు."

ఆంద్రీ గబగబా సావడిలోకి వెళ్లాడు.

మాంట్ క్రిస్టో లోగదిలో ఉండే నూతనవ్యక్తు లిద్దరినీ గుప్తవాతాయనంగుండా కనిపెడుతున్నాడు.

ప్రక్కగదిలో మాంట్ క్రిస్టోకి వినపడేలాగ ఆంద్రీ బిగ్గరగా "నాన్నా! నాన్నా!" అన్నాడు మేజర్‌ని చూసి.

"నాయనా!" అన్నాడు మేజర్ దుఃఖభారంతో కుంగిపోతున్నట్లు.

ఒకరి నొకరు సమీపించి, కొంత ముందు వెనకాడి తరవాత పరిష్వంగం చేసుకున్నారు. కాని నాటకరంగంపైన నటులమాదిరిగా ఇద్దరి మధ్యనూ వాస్తవంగా ఆపేక్ష లేదని స్పష్టపడుతోనే ఉంది.

"మన మింక ఎన్నడూ విడిపోము కదా?" అన్నాడు ఆంద్రీ.

"నీకు ఫ్రాన్సుదేశం ఇప్పుడు జన్మభూమిలా కనపడుతుంది కదా ఆంద్రీ."

"నిజం నాన్నా! ఫ్రాన్సుదేశం విడిచివెళ్లడం నాకు ఇష్టం లేదు."

"నేను లుక్కా విడిచి ఎక్కడా ఉండలేను. అందువల్ల నేను వీలైనంత త్వరలో వెళ్లిపోతాను.

"అయితే మీరు ఇటలీ వెళ్ళిపోయేముందు నా వారసత్వాన్ని నిరూపించుకోడానికి చర్చిపత్రాలు ఇస్తారా?"

"నేను అందుకే వచ్చాను."

"అయితే పత్రా లెక్కడున్నాయి?"

"ఇవిగో."

ఆంద్రీ తన తండ్రి వివాహానికి సంబంధించిన పత్రాలనూ, తన నామకరణానికి సంబంధించిన పత్రాలనూ తీసుకున్నాడు. పత్రాలను పరిశీలించాక ఆంద్రీ ముఖం వికసించింది. "ఇంక ఫరవా లేదు. పోలీసులు వెంటపడతారనే భయం ఇంక లేదు." అన్నాడు ఆంద్రీ.

"అంటే?"

"అంటే" అని ఆంద్రీ మేజర్‌ని సమీపించి మెల్లిగా చెవిలో ఇలా అన్నాడు: "నాకు తండ్రిగా నటిస్తున్నందుకు మీ కెంత ఇస్తున్నారు? నేను మీ కొడుకుగా నటిస్తున్నందుకు నాకు సాలుకి 50 వేలు ఇస్తారు. అందువల్ల మీరు నా తండ్రి కారని ఎప్పుడూ అనను."

"అయితే నా మాట చెప్తాను. నాకు ఏభైవే లిచ్చారు."

"మాంట్ క్రిస్టో మాటల్ని నమ్మవచ్చునన్నమాటేనా?"

"తప్పకుండా. కాని మనపని మనం జాగ్రత్తగా నెరవేర్చాలి; నేను వాత్సల్యంకల తండ్రిగానూ..."

"నేను మీ గారాబు కుమారునిగానూ నటించాలి; వాళ్లు అల్లా అనా లన్నారు కాబట్టి."

"వాళ్లు అంటే ఎవరు?"

"ఏమో! నాకుమాత్రం సరిగా తెలుసునా! నాకు ఉత్తరం వ్రాసిన మనిషిని గురించి చెప్తున్నాను. మీ కక్కడా ఒక ఉత్తరం వచ్చిందా?"

"వచ్చించి.?"

"ఎవరివద్ద నించి?"

"బుసోనీవద్దనించి."

"ఆయ నెవరో మీకు తెలుసునా?"

"తెలియదు. అసలు ఎన్నడూ ఆయన్ని నేను చూడలేదు."

"ఉత్తరంలో ఏం వ్రాశారు?"

"ఇదిగో చదువు."

ఆంద్రీ మెల్లిగా ఉత్తరం చదివాడు. అందులో ఇలా ఉంది.

"మీరు పేదస్థితిలో ఉన్నారు. మీకు వృద్ధాప్యం ముంచుకువస్తోంది. మీకు ధనం కావాలా? స్వతంత్రంగా జీవించాలని కోరుకుంటున్నారా? అలాగయితే వెంటనే పారిస్ నగరం వెళ్లండి. వెళ్లి పదిహేనేళ్ళ క్రితం తప్పిపోయిన మీ కుమారునికోసం కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టోని అడగండి. మీ కుమారుడు అయిదేళ్ళప్పుడు తప్పిపోయాడని చెప్పండి. ఆ కుమారుని పేరు ఆంద్రీ కావల్కాంటీ, సరిగ్గా మే 26 వ తేదీ సాయంకాలం ఏడు గంటలకు మాంట్ క్రిస్టోని కలుసుకోండి—బుసోనీ."

"అరె! సరిగ్గా ఇలాంటి ఉత్తరమే నాకూ వచ్చింది' అన్నాడు ఆంద్రీ.

"ఎవరివద్దనించి?" అన్నాడు మేజర్.

"సింద్‌బాద్ అని పేరుపెట్టుకు లార్డ్ విల్మోర్ అనే బ్రిటిష్ దేశస్థునివద్దనుంచి."

"ఆ ఉత్తరంలో ఏమని వ్రాసిఉంది?"

"ఇదిగో చదవండి."

ఆంద్రీ తన జేబులోనించి ఒక ఉత్తరం తీసి మేజర్‌కి ఇచ్చాడు. మేజర్ ఉత్తరాన్ని చదివాడు. అందులో ఇలా ఉంది.

"నువ్వు చాలా దీనస్థితిలో ఉన్నావు. ముందురోజు లెలా గడుస్తాయో తెలియక బెంగపెట్టుకున్నావు. నీకు పేరుప్రతిష్ఠలు కావాలా? ధనవంతు డౌదామని నీకు కోరికుందా? స్వతంత్రంగా బ్రతకాలని కోరుకుంటున్నావా? అయితే, మే 26 వ తే. సాయంకాలం ఏడుగంటలకు పారిస్‌నగరంలో కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టోని కలుసుకో. నీ తండ్రిని చూపించమని ఆయన్ని అడుగు. నువ్వు మేజర్ కావల్కాంటీ కుమారుడవ్. నీ వారసత్వానికి

సంబంధించిన పత్రాలను నీ తండ్రి అక్కడ ఇస్తారు. నీకు సాలుకి 50 వేలు ఇస్తారు—సింద్ బాద్."

"బలేగా ఉంది" అన్నాడు మేజర్. "మీరు మాంట్ క్రిస్టోని చూశారా?"

"ఆయన్ని చూసే ఇలా వచ్చాను" అన్నాడు ఆంద్రీ.

"అసలు సంగతేమిటో ఏమైనా బోధపడిందా?"

"బొత్తిగా బోధపడ్డంలేదు."

సరిగ్గా ఈ సమయంలో మాంట్ క్రిస్టో ప్రవేశించాడు. అడుగుల చప్పుడు విని ఇద్దరూ మళ్లీ పరిష్వంగం చేసుకున్నారు.

"ఆహా" అన్నాడు మాంట్ క్రిస్టో చిరునవ్వుతో.

"నా కొక్కటే చింత" అన్నాడు మేజర్. మాంట్ క్రిస్టోని చూసి "త్వరలో నే పారిస్ విడిచి వెళ్లిపోవలసి వస్తోంది."

"మేజర్! మిమ్మల్ని పారిస్ సమాజంతో పరిచయ పరిచిన తరవాత మీరు వెళ్లవచ్చులెండి."

"మీ మాట అతిక్రమించను" అన్నాడు మేజర్.

మాంట్ క్రిస్టో ఈమారు ఆంద్రీవంక తిరిగి "ఆంద్రీ! నీ స్థితిని గురించి నీ తండ్రికి చెప్పు."

"నిజం. కాని ఎలా చెప్పను?"

"ఫరవాలేదు చెప్పు నాయనా? నీ చిక్కేమిటి?" అన్నాడు మేజర్.

"ఏముంది? అతనికి మీరికనించి సాలీనా ఏదో కొంత ధనం ఏర్పాటు చెయ్యాలి."

"ఎవరు? నేనా?" అన్నాడు మేజర్ తొట్రుపడుతూ.

"అవును. మీరే" అంటూ మాంట్ క్రిస్టో ఆంద్రీని సమీపించి ఒక నోట్లబొత్తి అతని జేబులో ఉంచాడు.

"ఇదేమిటి?" అన్నాడు ఆంద్రీ.

"ఇది నీ తండ్రి నీ కిచ్చిన ధనం."

"నిజంగా నా తండ్రికి నాపట్ల ఎంత ప్రేమ!" అంటూ ఆంద్రీ బొత్తి జేబులో కుక్కుకున్నాడు.

"ఇంక మీరు మీ నివాసాలకి వెళ్తారేమో?" అన్నాడు మాంట్ క్రిస్టో.

"తిరిగి తమ దర్శనం నా కెప్పుడు?" అన్నాడు మేజర్.

"అవునండి మళ్లీ ఎప్పుడు మిమ్మల్ని చూసే భాగ్యం లభిస్తుంది నాకు?" అన్నాడు ఆంద్రీ.

"శనివారంనాడు. ఆట్వీల్ లో నా భవనంలో ఆ రోజున విందుచేస్తున్నాను. మీ బాంకరయిన డాంగ్లర్ నీ మరికొంతమందినీ విందుకి ఆహ్వానిస్తున్నాను. డాంగ్లర్ కి మిమ్మల్ని ఇద్దరినీ పరిచయ పరుస్తాను."

"విందు ఎన్ని గంటలకి?" అన్నాడు ఆంద్రీ.

"సరిగ్గా సాయంకాలం ఆరున్నరకి."

"తప్పకుండా వస్తాం" అన్నాడు మేజర్.

తండ్రి కొడుకు లిద్దరూ మాంట్ క్రిస్టోకి వందనంచేసి వెళ్ళిపోయారు. మాంట్ క్రిస్టో హేళనగా తనలో నవ్వుకున్నాడు. ★

---

# పీనాసి పుల్లయ్య

(41 వ పేజీ తరువాయి)

తీసుకుపోయి అక్కడ దిగవిడచితే ఒక రూపాయి 'కూలి' యిస్తానన్నాడు నావికునికి. సరే నన్నాడు నావికుడు. అయితే నీళ్లల్లో మునిగిపోయిన తరువాత తన రూపాయి వస్తుందో రాదోననే భయంతో, ముందే యివ్వమని అడిగాడు. పుల్లయ్య మూటవిప్పాడు. అందులోనుంచి ఒకరూపాయి తీశాడు యివ్వడానికి. కాని ఆ రూపాయి ధగధగా మెరుస్తూంటే, యివ్వడానికి మనసొప్పలేదు. అందుకని నావికునితో "ఒరే! నీకు పుణ్యముంటుంది. నాకు రూపాయి యివ్వడానికి మనసొప్పడంలేదు. కాబట్టి పుణ్యార్థం వుచితంగానే నన్ను తీసుకెళ్లి అక్కడ దిగబెట్టిరావా"? అనిచెప్పి బ్రతిమిలాడాడు. మొదట నావికుడు అంగీకరించలేదు. తరువాత ఆలోచించి తన తెలివి తక్కువతనాన్ని గ్రహించాడు. ఇప్పుడు యీ ఒక్కరూపాయికోసం ఆశపడితే లాభంలేదు. తరువాత డబ్బంతా చే జిక్కించుకోవచ్చుననే వూహ తట్టింది. సరేనని అంగీకరించి, నావమీద పుల్లయ్యను కూర్చోబెట్టి సముద్రం మధ్యలో దగవిడచి ఆడబ్బంతా సంగ్రహించి నావికుడు సంతోషంతో ఒడ్డు చేరుకొన్నాడు. ★

## గ్రంథసమీక్ష

(45-వ పేజీ తరువాయి)

చివరలో నాగభూషణం కూడా అదే విధంగా ప్రవర్తించినప్పటికీ ఆమె అతన్ని ప్రేమించడం మానదు. ఇది సమన్వయించ రాని వైరుధ్యం.

సెక్సు రచయితలకు సంఘంమీద, ముఖ్యంగా పురుషజాతిమీద పట్టరాని ఆగ్రహం. ప్రతి సెక్సుకథలోను ప్రేయసీ ప్రియులు "సంఘంతో మాకు నిమిత్తం లేదు" అని ఎదిరిస్తారు. "మాకూడా మీతో నిమిత్తంలే" దని సంఘమంటే సంఘానికి రాక్షసత్వం ఆపాదిస్తారు. సంఘానికి వ్యక్తితోను, వ్యక్తికి సంఘంతోను బాంధవ్యం భేదించవీలులేనిది. కాని సెక్సురచయితలు తమ నాయికా నాయకులను సంఘాతీతులుగా భావిస్తారు. సంఘంలో అన్యాయం ఉంటే దాన్ని ఏవిధంగా పరిష్కరించాలో వారు సూచించరు. విశృంఖలత్వాన్ని బోధిస్తారు. విశృంఖలత్వం పరిష్కారమార్గం కాదు. కాదనడానికి ఈ కథ ఉదాహరణ.

సీత రాముని చూసీ చూడగానే ప్రేమించిందని వాల్మీకి వ్రాస్తే బూటకమని వాదిస్తారు సెక్సు రచయితలు. కాని 'శిథిల సంధ్య'లో నాయిక నాయకుని మొదటి చూపులోనే ప్రేమిస్తుంది. ప్రేమ గాని, ద్వేషం గాని గాఢత్వం పొందడానికి, సమసిపోవడానికి కొంతకాలం పడుతుందనేది మానవుల అనుభవం.

భర్తలు భార్యల్ని కేవల భోగ్యవస్తువులుగా వాడుకుంటున్నారని ఈ రచయిత ఆరోపణ. కాని ఈ కథలో నాయికా నాయకులు అంతకంటే ఏ ఉన్నత మహత్కార్యాన్ని సాధించారో తెలియదు.

సాహిత్యం ఈ రోజున - ఈ రోజునే కాదు—ఏ రోజునైనా - ఒక ఆయుధం లాంటిది. బాధ్యతారహితులైన రచయితల చేతుల్లో అది సంఘజీవితానికి విచ్ఛేదకంగా పరిణమించే ప్రమాదం ఉంది.

(ఎస్నార్)



## గ్రంథస్వీకారము.

భారత రాజ్యాంగము - స్వదేశ సంస్థానములు

రచయిత: వలిదండ శ్రీనివాసరావు; వెల 0-4-0; దొరకుచోటు: శారదా గ్రంథాలయము, గాంధీ ఆశ్రమం, అనకాపల్లి.

పరిశోధన (పిల్లల కథ)

రచయిత: సి. హెచ్. దుర్గాదాసు; దొరకుచోటు: శ్రీ శివాజి బాలసంఘం, భీమవరం; వెల 0-4-0.

## కొత్తపత్రిక

దండోరా:—

సంపాదకుడు: శ్రీ కళారి వీర్రాజు, సంయుక్త సంపాదకులు: రాంషా, సోమసుందర్. వెల 4 అణాలు.

"సత్యాన్ని నిశ్శంకగా ప్రజాదృష్ట్యా" ప్రకటించడం, "మనసంస్కృతిని వెలుగుబాటలోనికి" తీసుకుపోవడం అనే ఉదాత్తాశయాలతో సాంస్కృతిక పక్షపత్రిక ఈఆగస్టు 15 నుండి సామర్లకోట నుండి వెలువడుతున్నది.





ఒక యువతి: నిన్నరాత్రి క్లార్క్‌గేబుల నా కలలోకి వచ్చాడు. నన్ను కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నాడు."

మరొక యువతి: "తరవాతేం జరిగింది?"

మొదటి యువతి: "అప్పటికే పొద్దెక్కింది. అందుకని నిద్ర లేచాను. కాని ఇవ్వాళ రాత్రి పెందరాళే నిద్రపోదలుచుకున్నాను."

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras

త్వరలో వెలువడనున్నది।

ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడు

అలెగ్జాండర్ డ్యూమా

రచించిన

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(మొదటి భాగం)

అనువాదం:

సూరంపూడి సీతారామ్

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికనుండి పునర్ముద్రితము.

**వెల: మూడున్నర రూపాయలు**

కాపీలకు:

## ఆంధ్రగ్రంథమాల,

**మద్రాసు 1.**

